# అవునా! కాదా!!
(నాటిక)

# మనసులోని మధన
(నాటిక)

# ఎందరో మహానుభావులు
(హాస్య నాటిక)

రచన:
డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు
బాపట్ల (గుంటూరు జిల్లా)

పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

## గ మ ని క

ఈ నాటికలు ప్రదర్శించ గోరేవారు ముందుగా నా అనుమతి పొందాలి. అనుమతికొరకు ప్రదర్శన తేదీ-సందర్భమూ, సంస్థపేరు, కార్యదర్శిపేరు, జవాబు కొరకు తపాలాబిళ్లలు పంపవలెను. ఏవి పంపక పోయిననూ అనుమతి పంపబడదు.

ఇట్లు

డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు

బాపట్ల (గుంటూరు జిల్లా)

## పాత్రలు:

| | |
|---|---|
| గోపాలం : | 15–16 ఏళ్ల కుర్రవాడు. |
| రాధ : | 8 ఏళ్ల పిల్ల గోపాలం చెల్లెలు. |
| బాబాయి : | 50 ఏళ్లవాడు. కరణం. గోపాలంపినతండ్రి. |

# అవునా! కాదా!!

[ఒక పల్లెటూరి కరణంగారి యింట్లో ఒక ప్రక్క గది. కుడిప్రక్క ద్వారం యితర గదులకు దారి. గోడలనిండా పాతరకపు పఠాలుతగిలించి వుంటాయి. మధ్యలో ఒక మంచం దాని తలదిక్కున ఒక పాత టేబుల్-దాని మీద ఒక పెద్దసంచీ సంచీలో బొమ్మ పిస్తోలు ఒక మెడల్. టూత్ బ్రష్ పేస్టు మొ॥ లైనవి వుంటాయి. టేబుల్ ప్రక్కనే ఒక కుర్చీ కూడా వుంటుంది. మంచం కాళ్ల దిక్కున ఒక పడకకుర్చీ వాల్చివుంటుంది.

తెర లేచేసరికి మంచం మీద గోపాలం అనే పదహారేళ్ల కుర్రవాడు పడుకుని నిద్రపోతున్నాడు. గోపాలం దగ్గరున్న ఒక బస్తీలో చదువుకుంటూన్నాడు. పరీక్షలయిపోయిన తర్వాత సొంతవూరు వచ్చాడు-అంతకు క్రితంరోజున.

అప్పుడే చాలా ప్రొద్దెక్కింది. లోపల్నించి అన్నయ్యా అన్నయ్యా అని కేకలు వినిపించాయి. గోపాలం లేవలేదు. "అన్నయ్యా-అన్నయ్యా" అంటూ "రాధ" ప్రవేశిస్తుంది. రాధ సుమారు 7-8 ఏళ్లు చురుకైన పిల్ల. గోపాలందగ్గరకెళ్లి పిలచినా లేవకపోతే-తట్టిలేపుతుంది. పల్లెటూరి చదువు మాత్రం చదివినపిల్ల! మాటల్లో పెంకెతనం కనబడుతుంది.]

రాధ—అన్నయ్యా!

గోపా—(తిరిగి పడుకుంటాడు.)

రాధ—అన్నయ్యా. అన్నయ్యా. (తట్టి లేపుతోంది.)

గోపా—(లేవడు.)

రాధ—ఒరే అన్నయ్యా (గట్టిగా కొట్టి లేపుతుంది.)

గోపా—(ఆవలించి-లేచివళ్ళు విరుచుకుంటాడు. లేచాడుగదా అని రాధ లోపలికి వెళ్తుంది. గోపాలం మళ్ళీ పడుకుంటాడు కాసేపటికి రాధ తిరిగివస్తుంది. మళ్ళాపడుకున్న గోపాలాన్ని చూచి తెల్లబోయి.)

రాధ—మళ్ళీ పడుకున్నావా. ఇంకా మత్తు తీరాలా లే. లే. బాబాయి చూశాడంటే యింకేమన్నావుందీ. చూడు! ఎంతపొద్దెక్కిందో.

గోపా—ఎంతయిందేం?

రాధ—(బల్లమీద పెట్టివున్న Wrist Watch చూసి) ఏడు, ఏడూ - పెద్దముల్లు అయిదుమీదా—5 × 5 = 25. 7–25 అయింది. 7–25. (అని గుణించుకుని చెప్తుంది.)

గోపా—ఇంతేనా! ఇంకా అరగంటవుంది. (అనిఇంకా బద్ధకంతో మళ్ళీ పడుకుంటాడు)

రాధ—మళ్ళీ పడుకుంటున్నావూ? ఆగు. వెళ్ళి బాబాయితో చెప్తాస్తా.

గోపా—బాబాయితో చెప్పు. ఏమన్నా చెయ్యి; ఎనిమిది కొట్టిందే లేవటం మనకలవాటులేదు,

రాధ—రోజూ ఎనిమిది దాటాకా లేవడం.

గోపా—ఎనిమిదికాండే గాడిదలరచినా లేవను.

రాధ—బాబాయికి తెలిస్తే నిలువునా పాతేస్తాడు.

గోపా—పాతేసినాసరే! పాతేస్తే మరీ బాగా నిద్రపోవచ్చు.

రాధ—ఆకూరాకే బాబాయితో అను; తాటిమట్టతో వీపు పగలకొడతాడు. నీ కాలేజీలోలాగ బాబాయిదగ్గర సాగుతుందనుకున్నావేం ?

గోపా—ఈయన్ని కాలేజీలోకూడ తెచ్చిపెట్టకు. హాయిగా బ్రతుకుతున్నాం. ఆ-కాఫీ అయిందా?

రాధ—కాఫీ !!

గోపా—ఆ కాఫీ కాయలా!! నిద్రలేచేటప్పటికి కాఫీయివ్వక పోతే హాస్టల్‌లో కుక్కా-బుర్ర (శ్రీ)రామకీర్తనే.

రాధ—కుక్కా- ?

గోపా—అదే! వంటవాడు.

రాధ—తల బద్దలు కొట్టటమే-ఏకంగా ?

గోపా—ఆ.

రాధ—ఆ మాట బాబాయితో అనకు. నిద్రలేవంగానే కాఫీ తాగుతానని.

గోపా —ఏం ?

రాధ—నీ బుర్ర రామకీర్తనే.

గోపా —బుర్ర రామకీర్తన పాడిస్తాడేఁపకంగా; అప్పు డిట్లా తప్పుకుంటాను. బాబాయి కర్రతోసహా యిట్లా పడి పోతాడు. వెంటవే బాబాయి బుర్ర ''ఠా''

రాధ——బాబాయిని కొడతావురా బుర్రమీద.........ఏడి శాప్.

గోపా——ఏం! బాబాయి ఏం గొప్ప-మిలిటరీకసరత్ నేర్చు కున్నాను- తెల్సా-కాలేజీలో; రమ్మను -క్షత్రియుద్ధానికి, నాతో.

రాధ——క్షత్రి యుద్ధంకూడా నేర్పుతార్రా కాలేజీలో,

గోపా——క్షత్రియుద్ధం చంద్రరేఖ చూచి నేర్చుకున్నాలే. కాలేజీలో మిలిటరీ కసరత్ నేర్పుతారు. దాంట్లో మనం ఫస్టు. (అని Pipe పేస్తాడు)

రాధ——అదేమిట్రా? పిస్తోలా (అని తీసుకు చూస్తుంది)

గోపా——కాదు-Pipe.

రాధ——పైపూ! అంటే?

గోపా——దాని పేరు ''పైపు'' దీన్ని కాలుస్తారు.

రాధ——నే కాలుస్తారా అన్నయ్యా!

గోపా——నువ్వా? ఊఁ-కాల్చు.

రాధ——దీపంబుడ్డి పట్రానా వెలిగించి..... ...

గోపా——అక్కర్లేదే; నిప్పెట్టె వుందలే.

రాధ—నువ్వే అంటించరా; నే పట్టుకుంటాను(అని మతాబు పట్టుకున్నట్టు పట్టుకుంటుంది.)

గోపా—అల్లా కాదు, (అని తీసుకుని పుగాకు పైపులో పెడతాడు.)

రాధ—ఆ! మందు కూరి కాల్చాలా?

గోపా—ఆ మందు కూరి, నోట్లో పెట్టుకు కాల్చాలి.(నోట్లో పెట్ట బోతాడు.)

రాధ—మరి నోట్లో పేలితే!!

గోపా—పేలదు.

రాధ—పువ్వు లొస్తాయా మరి.

గోపా—పొగవస్తుంది-పీలిస్తే.

రాధ—ఆ! చుట్టా యిది. (ఛీ ఛీ అంటూ పారేస్తుంది.)

గోపా—ఛ. పైప్.

రాధ—అంటేలే కొయ్య చుట్ట! ఛీ, ఛీ (వుమ్మేస్తుంది.)

గోపా—(తీసుకు తుడిచి మందు కూరి పీలుస్తాడు.)

రాధ—నువ్వు చుట్టలు కాలుస్తావుట్రా?

గోపా—ఛీ! ఛీ! యిది చుట్ట కాదు.

రాధ—అదే కొయ్య చుట్ట.

గోపా—ఛీ! ఇది చుట్టగాదు. పైప్—పైపంటారు. దొరలు కాలుస్తారు దీన్ని.

రాధ—అదే! దొరలు కాల్చే చుట్ట.

గోపా—ఏయ్-Fool పల్లెటూరి గబ్బిలాయి మొహం
నువ్వూనూ.

రాధ—ఆ (ఏడవబోతూ) నేను పల్లెటూరి గబ్బిలాయినా!
ఆగు. బాబాయితో చెప్తాస్తా; ఊ-ఊ-నన్ను పల్లెటూరి
గబ్బిలాయి అన్నాడూ, (వెళ్ళబోతుంది.)

గోపా—ఆగు; కాస్త ఆగి కాల్చుకోనీ.

రాధ—నన్నెందుకనాలేం-పల్లెటూరి గబ్బిలాయని.

గోపా—కాదులే; యిహ ఊరుకో.

రాధ—నన్నెందుకు తిట్టాలి-అనవసరంగా?

గోపా—లేదులే; బస్తీ గబ్బిలాయి వేలే.

రాధా—బస్తీ గబ్బిలాయి బాగుంటుందిట్రా.

గోపా—ఓ చాలా అందంగా వుంటుంది.

రాధా—నీ లాగావుంటుందా-కోటూ అదీ వేసుకుని.

గోపా—ఛ నాలాగెందు కుంటుందీ.

రాధ—మరేలాగుంటుందిరా!

గోపా—నీ మొహంలా వుంటుంది.

రాధ—నా మొహంలాగా; నే బస్తీ గబ్బిలాయినా! ఆగు;
బాబాయితో చెప్తాస్తా?

గోపా—ఆగు.

రాధ—మరి నన్నెందు కనాలి?

గోపా—అనన్లేయిక.

రాధ— ఏమనన్ ?

గోపా - బస్తీ గబ్బిలాయివని.

రాధ —మరి పల్లెటూరి గబ్బిలాయి అంటావా ?

గోపా— ఆగబ్బిలాయీ అనను.

రాధ — మరేగబ్బిలాయి అంటావ్?

గోపా— ఏ గబ్బిలాయీ అనను. నువ్వు విసిగించకు. వెధవ ఫ్రాంళ్లో హోటల్ కూడా లేదు కాఫీ తాగుదామంటే.

రాధ— హోటల్‌కి వెళతావుట్రా?

గోపా— వెళ్లటానికి లేదుగా ?

రాధ— బాబాయి చూస్తే కోప్పడ్డూ?

గోపా— మూడ్దాగాని ఒకపనిచేస్తా—

రాధ— ఏమిటది ?

గోపా— బాబాయి ఏంచేస్తున్నాడూ ?

రాధ— పూజచేసుకుంటున్నాడు.

గోపా— చాటుగా వెళ్లి కుండలో పాలు కాసిని, వెన్నెల్లు కాసిన్ని పట్రా.

రాధ— ఎందుకూ ?

గోపా— చెప్తా పట్రా.

రాధ— అహా ! నే పట్టాను.

గోపా— ఏం ?

రాధ— ఎందుకో చెప్తే.

గోపా—తమాషా చేస్తా పో-త్వరగా.

రాధ—(వెళ్లబోయి) నేపట్టుకురానురా!

గోపా—ఏం?

రాధ—బాబాయి కోప్పడతాడు.

గోపా—కోప్పడితే ఎరగడూ; పిస్తోలుతో పేల్చిపారేస్తా.

రాధ—బాబాయినే!!

గోపా—ఆ! లెక్కా-ఏం?

రాధ—ఏడిశావ్. పిస్తోలు ఎక్కడిదేం నీకు.

గోపా—నాదగ్గర పిస్తోలు లేదనుకున్నావా? (తీసి) యిదిగో, దీనితో గురిచూంశికొడితే ఠా-హా-అంతే.

రాధ—మరిదీంతో గొడితే బాబాయి చచ్చిపోడు ట్రా?

గోపా—ఆ.

రాధ—చచ్చిపోతే మర ఎల్లాగురా అన్నయ్యా!

గోపా—ఏం? చచ్చిపోతే ఏం? నేనులేనూ-అన్నీ చూడటాన్కి.

రాధ—(ఏడుస్తుంది).

గోపా—ఇదేమిటి! ఏడుస్తున్నావ్!

రాధ—బాబాయి-బాబాయీ......

గోపా—ఊరికే అన్నాలే.

రాధ తుపాకీ వుందీ (తుపాకీచూపిస్తూ) అయ్యో బాబాయీ

[లోపల్నించి ఏమిట్రా ఆగోడవ; రాధా అని బాబాయి కంఠస్వరం వినపడ్తుంది]

గోపా—ఊరుకోవే! అది బొమ్మ తుపాకీయే!

రాధ—బొమ్మదా!

గోపా—ఆ-బొమ్మది.

రాధ—అయితే దీంతో పేలిస్తే............

గోపా—చావరు. "ఢాం"-అంటుంది. అంతే.

రాధ—మరి బాబాయిని చంపేస్తానన్నావ్?

గోపా—ఊరికేనే అన్నా; ఊరుకో నువ్వు.

రాధ—నాకది యివ్వవుట్రా; ఆడుకుంటారా!

గోపా—ఇస్తాను-నే చెప్పిన పనిచేస్తే.

రాధ—ఏమిటది?

గోపా—పాటూ వేస్నిష్లూ పట్టుకువస్తే.

రాధ—ఇస్తే పట్టుకువస్తా.

గోపా—ఇదద మరి; త్వరగా పట్రావాలి.

రాధ—పేలుతుందేమోరా?

గోపా—పేలదు.

రాధ—పేలితే చచ్చిపోతాంరా!

గోపా—పేలినా చావవ్. మరి త్వరగా పట్రా.

(జాగ్రత్తగా భయంతో పట్టుకుంటుంది)

రాధ—(వెళ్ళబోయి తిరిగివచ్చి) నే పట్టుకురానురా!

గోపా—మళ్ళీ.

రాధ—కాఫీకా! పాలూ సెఖ్యా?

గోపా—మరి.

రాధ—మరి కాఫీపొడో—

గోపా—పొడి నాదగ్గరుంది లే?

రాధ—అయితే తెస్తానాగు. (వెళ్లబోయి ఆగి) మరినాకూ యివ్వవుట్రా కాఫీ ?

గోపా—ఇవ్వను.

రాధ—అయితే తేను.

గోపా—పంచదారకూడా తెస్తే యిస్తాను.

రాధ—ఓ; తెస్తాను.

[నష్వ టూత్ బ్రష్. తీసుకుని బయటకు వెళతాడు మరికాసేపటికి ఇద్దరూ వస్తారు]

గోపా—తెచ్చావా ?

రాధ—ఇదిగో!

గోపా—(కాఫీపొడిబిళ్ల సంచీలోంచితీసి వేనీళ్లలో వేసి)ఇదిగో డికాషన్ (పాలుదాన్లోపోసి) కాఫీ, నీకిది—నాకది.

రాధ—అరే! కాఫీ తయారయిందే. (ఇద్దరూ తాగుతారు)

గోపా—(తాగుతూ) ఇల్లా లేవంగానే, కాఫీతర్వాత మిలట్రీ డ్రిల్ తర్వాత-భోజనం నిద్ర; సాయంత్రం టిఫిన్-అయిం తర్వాత షికారు లేకపోతే Foot Ball తర్వాత సినిమా; ఓ అల్లావుంటే హాయిగా-జల్సాగా.

రాధ—మరి చదువెప్పుడ్రా అన్నయ్యా ?

గోపా—చదువా! చదువు పరీక్షల్లో.

రాధ—పరీక్షల్లో తప్ప రోజూ చదవవుట్రా.

గోపా— ఛ! వెధవ చదువు రోజూనా?

రాధ—ఆగు; బాబాయితో చెప్తా; పరీక్షల్లోతప్ప చదవట్ట అని.

గోపా—రోజూచదువేమిటి? ఎందుకూ? రోజూచదివితే గుడ్డి ముండ Pass అవుతుంది.

రాధ—అయితే నువ్వు గుడ్డిముండవు కాదన్న మాట.

గోపా—అయినా మిలటరీలో చేరబోయేవాడికి చదువక్కర లేదు.

రాధ—అలాగా! మిలటరీ అంటే?

గోపా—మిలటరీ అంటే సైన్యం; బాగాచదువొస్తే సైన్యంలో చేర్చుకోరు. "ఛ-పనికిరావు పో" అంటారు.

రాధ—ఆహా!!

గోపా—క్లాసులో ఫష్టువస్తే N. C. C. లో Last అన్న మాట.

రాధ—N. C. C. ఏమిట్రా?

గోపా—అదే! చదువుకుండే పిల్లలకి మిలట్రీ Drill, ఆ పద్ధతులు అన్నీ నేర్పుతారు.

రాధ—తుపాకీ పేల్చటం కూడా?

గోపా—ఓ దాంట్లో మనకు First మెడల్సుగూడావచ్చింది.

రాధ—ఏడిశావ్.

గోపా— కోతలనుకున్నావా! ఇదిగో (సంచీలోంచి మెడల్స్ తీసి చూపిస్తాడు)

రాధ—బాగుందిరా అన్నయ్యా! నాకివ్వవ్ రా?

గోపా—ఛ—నీ కెందుకు?

రాధ—నా గొలుసులో వేసుకుంటాూరా?

గోపా—అబ్బె! ఇది గొలుసులో వేసుకో కూడదు. ఇక్కడ తగిలించుకోవాలి.

రాధ—పోనీ అక్కడే తగిలించుకుంటాూరా.

గోపా—అబ్బె మగవాళ్ళు షొక్కాకి తగిలించికోవాలి.

రాధ—తగిలించికుని ఏం చేస్తారు?

గోపా—తగిలించుకుని Drill Left Right-Left అంటూ తిరగాలి.

రాధ—నేనూ అలాగే తిరగుతాూరా?

గోపా—అబ్బె! మగవాళ్ళు, మిలట్రీ సైన్యంలో చేరే వాళ్ళు, తిరగాలి.

రాధ—నువ్వు చేరావా సైన్యంలో.

గోపా—చేరలే! చదువయిపోయిన తర్వాత; చేరతా; యిప్పుడన్నీ నేర్చుకుంటున్నా.

రాధ—ఏడిశావ్.

గోపా—మిలట్రీవాణ్ణి. ఏడిశావ్ అనకూడదు. అంటే ఏం చేస్తానో తెలుసునా, పేల్చివేస్తాను, తుపాకీతో.

రాధ—ఏడిశావ్!

గోపా— నన్నంటే అన్నావ్; ఇంకెవర్నీ అనకు.

రాధ—నిన్ను సైన్యంలో చేర్చుకుంటారేం?

గోపా—ఏం! తప్పకుండా చేర్చుకుంటారు.

రాధ—పడిశారు.

గోపా—తప్పు; తప్పు, వాళ్ళని పడిశారు అనకూడదు. Court Martial చేస్తారు.

రాధ—పడిశారు? బాబాయితో చెప్తా నన్నేమన్నా అంటే.

గోపా—బాబాయి బాబాయి ఎక్కడా! వాళ్ళెక్కడా! బాబాయిదేముంది After all. విలేజికరణం–on Fifteen Rupees జీతం.

రాధ— వాళ్ళకి జీతం ఎంతేం?

గోపా—ఓ హండ్రెడ్స్–రెండొందలు – మూడొందలు పైన తిండి. గుడ్డ, సిగరెట్, అన్నీ Free ఫ్రారికేనే.

రాధ—ఇచ్చి–రెండొందలూ–మూడొందలూ జీతమా!

గోపా—ఆ.

రాధ—అయితే నన్నూ చేర్చుకుంటార్రా–

గోపా—నిన్ను చేర్చుకోరు–నీ మొగుణ్ణి చేర్పిద్దాం–పెళ్ళయింతర్వాత పైగా యింకోటి; ఊళ్ళన్నీ తిరగొచ్చు–ఖర్చు లేకుండా బొంబాయి, ఢిల్లీ, కలకత్తా–అన్నీ.

రాధ—నిజంగా?!

గోపా—ఆ! లేకపోతే లెక్కేమిటి. నెధవ కరణీకం.

రాధ—అయితే మిలట్రీవాళ్లు తాశిల్దార్ కంటే గొప్పా.

గోపా—తాళిక్ దాస్! వెధవ తాళిక్ దాస్! జిల్లా కలెక్టర్ కంటె గొప్ప. పిల్లకి యుద్ధం అంటె హాడల్.

రాధ—అయితే మిలట్రీలో చేరితే యుద్ధం చెయ్యాలా?

గోపా—ఆ; చెయ్యాలి.

రాధ—నువ్వు యుద్ధం చేస్తావా?

గోపా—ఓ-కొరలతోసహా, నీగ్రోలతో కూడా యుద్ధం చేస్తాను.

రాధ—ఏడిశావ్-నీ చేతనవుతుందేం.

గోపా—ఏం చేతకాక? నాతో Fighting కి రమ్మను ఎవర్నైనాను.

రాధ—ఏడిశావ్ ఒక్క బాంబ్ వేస్తే పరుగెత్తుతావ్.

గోపా—పరుగెత్తకూడదు. మిలట్రీవాళ్లు దాక్కోవాలి. ట్రెంచీల్లో

రాధ—అయితే నిజంగా చేరతావేరా!

గోపా—ఓ! పరీక్ష ప్యాసవగానే చేరేస్తా.

రాధ—ఏడిశావ్-బాబాయి ఒప్పుకొంటాడేం.

గోపా—ఒప్పుకోకపోతే చెప్పకుండా చేరుతాను. అప్పుడేం చేస్తాడు.

రాధ—వీపు బద్దలుకొడతాడు.

గోపా—ఆ-నా చేతిలో ఏముంటుందో తెల్సా! తుపాకీ వుంటుంది-చేరింతర్వాత ఆ ఆటలేం సాగవ్.

రాధ—అసలు బాబాయి నిన్ను చేరనిస్తేగా?

గోపా—నేను చెప్పకుండా చేరిపోతా! అప్పుడేంచేస్తాడేం.

రాధ—నువ్వు చెప్పకపోయినా నేచెప్తాగా?
గోపా— ఏడిశావ్-చెప్తేనా ఎరగవ్.
రాధ—ఏడిశావ్, ఏంచేస్తావేంచెప్తే.
గోపా—ఇదిగో పిస్తోలు.
రాధ—అది పేలమగా?
గోపా—గుళ్లుపెడితే పేలుతుంది.
రాధ—ఏడుస్తా-పేలిస్తే, బాబాయి వచ్చేదాకా.
గోపా—ఏడు. ఏడుస్తే ఏం?
రాధ—ఇదిగో ఏడుస్తున్నా. ఏడుస్తున్నా.
(అంటూ ఆడిస్తూ అకస్మాత్తుగా అక్కడపెట్టిన మెడల్ తీసుకుంటుంది).
గోపా—అదేమిటి! యిచ్చెయ్యి.
రాధ—అహా పేల్చెయ్యి.
గోపా—ఇవ్వు చెప్తున్నా!
రాధ—చెప్తున్నా-పేల్చెయ్యి.
గోపా—ఇవ్వు; కోపంవచ్చిందంటే కొడతా?
రాధ—కొడితే ఏడుస్తా!
గోపా—ఏడుస్తే పేలుస్తా.
రాధ—పేలుస్తే-పేలుస్తే; నీకు ముసలిపెళ్ళాన్నిచ్చి పెళ్లి చేస్తా!
గోపా—నువ్వా! (అని వెంటపడతాడు. రాధ దొరకదు. ఆగోలకు బాబాయి వస్తాడు. బాబాయిరాంగానే గోపాలం పిల్లిలాగ నిలబడతాడు).

బాబా—ఏమిట్రా గొడవ పొద్దున్నే!

గోపా—ఏంలేదు బాబాయ్.

బాబా—స్నానం చేశావా?

గోపా—లేదు.

బాబా—చెయ్యి పో; బారెడు పొద్దెక్కినా, స్నానం లేదూ సంధ్యా లేదు—పో ముందు—వెధవలు—బస్తీ చేరంగానే అన్ని అలవాట్లుపోతాయి.

(తువ్వాలూ, సబ్బూ సంచిలోంచి తీసుకొని గోపాలం మెదలకుండా వెళ్తాడు).

బాబా—ఏమిటి గోల మొదలెట్టారూ ప్రొద్దున్నే.

రాధ—ఏంలేదు బాబాయ్.

బాబా—ఏం లేకపోవటమేమిటి; యిం రాత్రణ్ణించీ ఒకటే కేకలు; ఒకటే గోల; పూజచేసుకోనివ్వకుండా!

రాధ—ఏంలేదు.

బాబా—మళ్ళీ ఏంలేదంటావ్! ఏమీ లేకుండా పిచ్చికా—ఆ కేకలు వెధవ! కాలేజిలో చేరి చదువు వెలగబెడుతున్నాడు; రేపోమాపో ఉద్యోగం సంపాదిస్తాడు; చిన్నపిల్లలతో చేరి కేకలూ ఆటలూనా? (కాగితాలు చూసి ఇవేమిటి)

రాధ—అవి...(నసుగుతూ) అవి...

బాబా—నసుగుతావేం? ఏమిటివి.

రాధ—"కాఫీ" బాబాయ్.

బాబా—కాఫీ ఏమిటి?

రాధ—[illegible] బాబాయ్!

బాబా—కాఫీ కాచావా! లేవంగానే స్నానంచెయ్యాలన్ని—పీడుస్తేతేగాని, కాఫీ కాచావూ.

రాధ—నే తెచ్చాను బాబాయ్—బాబు నిన్న నేను తేనన్నా కాని పిస్తోలు చూపించి—లేకపోతే పేలుస్తానన్నాడు బాబాయ్.

బాబా—పేలుస్తాడా లేకపోతే—?

రాధ—పుకే—అదిగో బాబాయ్ తుపాకీ!

బాబా—తుపాకీ (ముట్టుకు చూడబోగా)

రాధ—ముట్టుకోకు బాబాయ్, పేలుతుందేమో;

బాబా—ఏడికేంది. ? (కాని భయపడి ముట్టుకోడు.)

రాధ—అది నాకే దేట బాబాయ్! వాడు మిలిట్రీలో చేరాట్ట బాబాయ్.

బాబా—మిలిట్రీలోనా?

రాధ—అదే! చేరతాట్ట బాబాయ్; బళ్ళో అన్నీ నేర్చుకున్నాట్ట. తుపాకీ పేల్చటంలో ఫస్టుట; పెడికో బిళ్ళకూడా యిచ్చారట బాబాయ్—ఫస్టువచ్చినందుకు, ఇదిగో బాబాయ్ బిళ్ళ.

బాబా—(Medal తీసుకు చూస్తుంటాడు.)

రాధ—తుపాకీ పేల్చటం బాగావచ్చుట బాబాయ్; ఎవర్నన్నా పేల్చేస్తాట్ట; నిన్నుగూడా పేల్చేయగలట్ట బాబాయ్.

రాధ—పోన్లే యీాబిళ్ళ యిప్పించన్ బాబాయ్.

బాబా—మిలట్రీలో చేరతావూ ఏడు ?

రాధ—ఆ-వెధవ కరిణీకం వెధవ 15 రూ॥ జీతం అన్నాడు.

బాబా—మిలట్రీలో చేరి శనగలు భోంచేస్తాడు కాబోలు.

రాధ—అక్కడ శనగలు పెడ్తారా బాబాయ్.

బాబా—ఆ-సెనగ లేమిటి! బొబ్బర్లుకూడా పెడతారు.

రాధ—మిలట్రీ శనగలు బాగుంటాయా బాబాయ్.

బాబా—(ఆలోచిస్తూ మాట్లాడడు)

రాధ—ఊరికే పెడ్తారా బాబాయ్-తిండీ, గుడ్డా, సిగరెట్లూ యిస్తారటగా-వూరికే.

బాబా—ఊ!! వీడు సిగరెట్లు కాలుస్తాడూ?

రాధ—కాలుస్తాడు బాబాయ్; కొయ్యచుట్ట కాల్చాడుస్తూడు.

బాబా—కొయ్యచుట్టా! కొయ్యచుట్టేమిటి?

రాధ—ఇదిగో బాబాయ్-దీని పేరేదో చెప్పాను; ఏమిటమ్మా-ఆ-పంపు; పంపు చుట్ట.

బాబా—ఓరి వెధవా! ప్రయోజకు డయ్యాడే!

రాధ—బాబాయ్; మిలట్రీవాళ్ళకి చదువక్కర లేదటగా,

బాబా—అన్నాడా?

రాధ—చదువుకొస్తే చేర్చుకోరట-అసలు.

రాధ—ఊ!!

రాధ—తను రోజూ చదవట్ట. చదువు పరీక్షరోజుల్లోనేట.

బాబా—అయితే సంవత్సరం పొడుగునా తిరగటమే.

రాధ—ఆ-ప్రొద్దున్నే కాఫీ-తరువాత Drill, తిండీ, నిద్రా తర్వాత, ఆటలూ, రాత్రికి సినిమాలు-

బాబా—ఓరీ కాడీ వెధవా!!

రాధ—సంవత్సరం పొడుగూనా చదివితే గుర్జీముండ కూడా Pass అవుతుం దట.

బాబా—ఇదా నీ డిక్కడ వెలగబెడుతున్న నిర్వాకం! రానీ-వెధవని-కనుక్కుంటా?

రాధ—నే చెప్పానని చెప్పక బాబాయ్.

బాబా—ఏం చెప్తే?

రాధ—ఆతుపాకీతో కాలుస్తాట్ట.

బాబా—ఏడిశాడు: వీపు బద్దలుకొడతా. పిలు వెధవని. ఏడీ? యింకా రాలేదే!

రాధ—రాలేదే! వస్తాడు బాబాయ్-స్నానం చేస్తున్నాడు.

బాబా—పిలు వెధవని; చచ్చీచెడీ రాత్రీపగలూ నిద్ర లేకుండా చీమోడ్చి నేను నెలనెలా డబ్బు పంపుతుంటే-యిలాతగలబెడుతున్నాడూ అక్కడకూర్చుని. ఇంటికిపట్టున పడుండి-యీ కాస్తేకం పొలంపన్లూ చూడకుండా మిల్ట్రీలో చేర్తాడూ? రమ్మను వెధవని. పో పిల్చుకురా.

[రాధ వెళ్తుంది. బాబాయి రెండుమార్లు అటూ యిటూ పచార్లుచేసి-వచ్చి-తుపాకీ భయంగానే తీసి అటూ యిటూ కదిపి చూస్తాడు. పొరపాటున మీట నొక్కగా పేలుతుంది. మళ్ళీ అక్కడ వుంచి కుర్చీలో కూర్చుంటాడు

ఆవలిస్తాడు. కళ్ళు మూస్తాడు. కాసేపయాక రాధ వచ్చి నాన్నా బాబాయ్-అని పలకరిస్తుంది. బాబాయ్ పలకడు- వెళ్ళి ప్రక్క కూర్చుంది. గోపాలం వస్తాడు మిలట్రీడ్రస్సులో.]

గోపా—బాబాయ్.

బాబా—(మిలిటరీ డ్రస్సులో గుర్తించలేక) ఎవర్రా నువ్వు?

గోపా—గోపాలన్నే.

బాబా—ఈ వేషం ఏమిటి?

గోపా—ఇదా! మిలట్రీ యూనిఫారం.

బాబా—ఇట్లా చూడు! ఈ వేషాలు పటాటోపాలు నా దగ్గర పనికిరావు.

గోపా—ఏం?

బాబా—ఏం ఏమిటి ఏం? మీ నాన్న పోతూపోతూ నిన్ను నాకు ఒప్పచెప్పి పోయాడు.

గోపా—ఎందుకో!!

బాబా—చదువు చెప్పించి, పైకి తీసుకురమ్మని-నాల్గెకరాల భూమీ యిల్లూ, యిచ్చి వెళ్ళాడు.

గోపా—అవునట.

బాబా—అవునా! దాన్ని నేను పథ్నాల్గెకరాలు చేశాను- నీ చదువు సంగతిగాక.

గోపా—అవును.

బాబా—నీ పెళ్ళి నీ చెల్లెలి పెళ్ళిచేసి మిమ్మల్ని ప్రపంచంలో బాగు చెయ్యాల్సిన బాధ్యత నాది.

గోపా—అవునవును.

బాబా—ఆస్తి నిల్వ యింటికే వచ్చింది.

గోపా—చేసెయ్యి—ఏ ముసలివాడికో యిచ్చి.

బాబా—నీ చదువు పూర్తి అయింది.

గోపా—ఇంకా Pass అవందే.

బాబా—రెండేళ్ళనుంచీ—పరీక్షల్లో తప్పుతూ వస్తున్నావ్.

గోపా—మరే—Examiner మార్కులు వేస్తేగా?

బాబా—సరే. అన్నమాట నే నిలబెట్టినా—నువ్వు నిలబెట్టటం లేదు.

గోపా—మా నాన్న నాకేం చెప్పందే—ఏం నిలబెట్టను.

బాబా—మీ నాన్న నిన్ను తప్పమనలే ఎప్పుడూ.

గోపా—Pass అవమనీ అనలే.

బాబా—ఈ పదేళ్ళబట్టీ నేనెం కష్టాలుపడి గడ్డితిని ఆస్తి వృద్ధిచేశానో భగవంతుడికి ఎరుక.

గోపా—తాశిల్దారుకీ తెలుసు.

బాబా—వేళకి తిండిలేకపోయినా, రాత్రిళ్ళు తరబడి నిద్ర లేకపోయినా, తిరిగి తిరిగి నాచేతిమీదుగా పదెకరాలు సంపాదించాను.

గోపా—ఉన్నది చాలక.

బాబా—అదంతా చేసింది మీకోసమే.

గోపా—అవును, నీకు కొడుకులు లేరుగా?

బాబా—రాత్రి మట్టుకు రాత్రి తెల్లవార్లూ నిద్దర లేదు నాకు.

గోపా—గడ్డితినడం అంటే అదే.

బాబా—ఇదంతా ఏదో పెద్దవాళ్ల య్యేదాక కనిపెట్టి వుండాలనే గాని లేకపోతే నాకొచ్చే నష్టంలేదు.

గోపా – లాభంవుంది.

బాబా—నీకూ యిక యింతవచ్చినట్టు......

గోపా—బుద్ధిరాకపోయినా.

బాబా— నాకు పెత్తనంవచ్చింది.

గోపా—చూపు బాగానేవున్నా......

బాబా—Intermediate దాకా తెలుగు పెట్టాను.

గోపా—పట్నంలో!

బాబా—పట్నంలో నువ్వు దమ్ముపట్టి నేర్చుకున్నపిల్ల వక్కటి;

గోపా—సిగిరెట్లు కాల్చడం.

బాబా—పొగరుబోతుతనం కూడాను!

గోపా—అది మిలట్రీ లక్షణం.

బాబా—ఏదో తంత్రీపోయిన తంత్రాలెన్నో ప్రారంభించి యిన్నాళ్లూను.

గోపా—చావగొట్టి లాభంలేక.

బాబా—కాని ఎన్నాళ్ళకీ నీకు బుద్ధిరావటంలే.

గోపా—ఆ వచ్చే Time దాటిపోయింది.

బాబా—ఇహం పూరుకుంటే లాభంలేదు.

గోపా—ఏదో నకటి చేద్దాం.

బాబా—ఇహా నేనీ కరణీకం చెయ్య లేను.

గోపా—మానెయ్యొచ్చు.

బాబా—నువ్వీ చదువు మానెయ్యాలి.

గోపా—మానేశి పంచెయ్యాలి.

బాబా—ఈ గ్రామరు వదలి వెళ్ళితే-యీపొలాలవీ చూసేవా ళ్ళూ లేరు.

గోపా—చేశేవాళ్లూ లేరు.

బాబా—కరణీకం అసలు విడలటానిక్కి వీల్లేదు.

గోపా—వంశపారంపర్యావస్తుంది గనుక.

బాబా—గనక కరణీకం Test pass అయినచ్చు

గోపా—ఆ పాసయివచ్చి?

బాబా—కరణీకం చార్జి తీసుకోవాలి.

గోపా—నేనా!!

బాబా—ఆ నువ్వే.

గోపా—వెధవకరిణీకం!!

బాబా—ఆ-!!

గోపా—వెధవ 15 రూ॥ జీతం.

బాబా—తెలివివుంటే బోలెడంత సంపాదించవచ్చు దీంట్లో

గోపా—మనకా తెలివి లేదు.

బాబా—అదేవస్తుంది, ముందు చేరి తే.

గోపా—దేంట్లో చేరి తే—?

బాబా—కరిణీకంలో.

గోపా—ఆమాటమాత్రం వద్దు.

బాబా—మరి దేంట్లో చేరదామునేం.

గోపా—మిలట్రీలో.

బాబా—మన వంశంలో యింతవరకూ ఎవ్వరూ చేరలే.

గోపా—నే నంతవరకూ యీవంశంలో పుట్టలా!

బాబా—నాకంఠంలో ప్రాణముండగా వీల్లేదు.

గోపా—పోనీ ప్రాణంపోయినతర్వాతే చేరతా.

బాబా—నే నిప్పుడప్పుడే పోను.

గోపా—నే పోగొడతాగా.

బాబా—నన్ను చంపుతావట్రా!!

గోపా—(తుపాకీతీసి) నువ్వేచస్తావ్ వేలి స్తే.

బాబా—నీ కేమన్నా బుర్రవుందా?

గోపా—మిలట్రీవాళ్ళ కల్లాంటి దేమీవుండదు.

బాబా—పెంచి పెద్దవాణ్ణి చేశానన్న విశ్వాసమన్నా లేదు.

గోపా—నిన్ను నే చెయ్యమనలేదు.

బాబా—పేల్చినా-కాల్చినా-మిలట్రీలో చేరటానికి నే వప్పుకోను.

గోపా—తర్వాత నన్ను నేం లాభంలేదు.

బాబా—మా అన్నకి నే ద్రోహం చెయ్యలేను.

గోపా—చేశావో-లేదో-వెళ్ళి కనుక్కురా!

బాబా—ఈ కరిణీకం మా అన్నదే.

గోపా—అనుమానం లేదు.

బాబా—మా అన్నే. నీతండ్రి.

గోపా—అయినా సరే!

బాబా—నీ తండ్రి కరిణీకం నీదే.

గోపా—అసంభవం—కాదు!

బాబా—అందుకే నువ్వు కరిణీకం చెయ్యాలి.

గోపా—అదిమాత్రం యిష్టంలేదు.

బాబా-- మరేది యిష్టం ?

గోపా—మిలిట్రీ వుద్యోగం.

బాబా—వీల్లేదు.

గోపా—బాగా ఆలోచించుకో.

బాబా—అన్నీ ఆలోచించాను.

గోపా—ఒకటి మర్చిపోయావ్.

బాబా—ఏం మర్చిపోలేదు.

గోపా—ప్రాణాలసంగతి.

బాబా—ప్రాణాలు తీస్తావా?

గోపా—ఆ.

బాబా—ఏడిశావ్.

గోపా—చూస్తావా?

బాబా—మిలట్రీలో చేరవద్దన్నానని ప్రాణాలు తీస్తావుట్రా.

గోపా—చేర్పించలేదని తీస్తాను.

బాబా—నాచేతుల్తో నే చేర్పించను. (అని పడకకుర్చీలో వెనక్కి పడుకుంటాడు)

గోపా—అయితే పేలిపోతావ్.

బాబా—పేలినా సరే.

గోపా—పేలిస్తే చచ్చిపోతావ్.

బాబా—చచ్చినా సరే.

(పిస్టల్ పేల్తుంది గోపాలం వెళ్ళిపోతాడు)

బాబా—పేల్చేశావ్రా బాబాయిని పేల్చేశావ్రా–పెంచి పెద్ద చేసి...

[అంటూ కుర్చీలోంచి ఖంగారుపడ్తూ లేస్తాడు. రాధ లేచి దగ్గరకు వస్తుంది]

రాధ—ఏమిటి బాబాయ్.

బాబా—గోపాలం ఏడీ.

రాధ—వస్తాడు.

బాబా—రానివ్వకు–రానివ్వకు.

రాధ—ఏం బాబాయ్ ?

బాబా—నన్ను పేల్చేడు.

రాధ—ఎప్పుడు బాబాయ్ ?

బాబా—ఇప్పుడేనే!!

రాధ—మెలుకువ తెచ్చుకో బాబాయ్! కలవరిస్తున్నావ్.

బాబా—ఆ–గోపాలం ఏడీ ?

రాధ—స్నానం చేసి వస్తున్నాడు.

బాబా—ఇంకా రాలా!

రాధ—రాలా!

బాబా—వచ్చాడే! యిప్పుడు.

రాధ.—రాలేదు బాబాయ్! నీళ్ళు కాగలేదు. అందుకని ఆలస్యమైంది.

బాబా—ఇప్పుడు వచ్చి మాట్లాడాడే!!

రాధ—లేదు బాబాయ్-కలవచ్చిందిగాబోలు నీకు.

బాబా—కలా! నిద్రపోయానా!

రాధ—ఆ.

బాబా—ఇంతసేపూ నిద్రపోతున్నానా.

రాధ—ఆ-ఇంతసేపూ నిద్రపోయాక. నే వచ్చి లేపినా లేవ లే.

బాబా—మరి లేపావా?

రాధ—లేపాను. లేవకపోతే అక్కడే కూర్చున్నా.

బాబా—ఇంతసేపూ అక్కడే కూర్చున్నావా?

రాధ—ఆ.

బాబా—నేను నిద్రపోతూనే వున్నానా?

రాధ—గురకపెడ్తూ నిద్రపోయావ్.

బాబా—ఇంత సేపూనా?

రాధ—ఇంతసేపూనూ; నే చూస్తూనేవున్నాగా?

బాబా—నిద్రపోతుంటే గోపాలం రాలే?

రాధ—వచ్చాడేమో!

బాబా—ఆ.

రాధ—కలలో బాబాయ్! కలవరిస్తూ లేచావ్.

బాబా—ఏమని కలవరించాను.

రాధ—"షేక్స్పియర్టా బాబాయిసీ! అంటూ లేచాన్.

బాబా—ఇంకా గోపాలం స్నానం చేసిరాలా అయితే.

రాధ—లేదు బాబాయ్.

బాబా—వెధవస్నానం! ఎంతసేపు చేస్తాడే!

రాధ—అయితే బాబాయ్ ?

బాబా—ఏమిటీ ?

రాధ—ఏం లేదు. బాబాయ్.

బాబా—ఏమిటది ?

రాధ—గోపాలాన్ని చేర్పిస్తావా, బాబాయ్ !

బాబా—దేంట్లో ?

రాధ—మిలట్రీలో.

బాబా—ఊఁ ?

రాధ—వాడు చేరతానంటున్నాడేం బాబాయ్.

బాబా—ఏడిశాడు.

రాధ—మరి తుపాకీతో బెదరిస్తున్నాడే!

బాబా—(ఆమాటకు ఖంగారుపడి గబుక్కున బల్లమీాద వున్న తుపాకీ పట్టుకొంటాడు).

రాధ—నిద్రమత్తువదల్లేదా బాబాయ్ తూలిపోతున్నావ్ ?

బాబా—మంచి నిద్రపట్టిందే; వెధవ జమాబంది లెక్కలతో రాత్రి మూాడు గంటలదాకా కూర్చున్నాం కాదూ...

రాధ—మూాడయిందీ పడుకునేటప్పటికి ?

బాబా—ఆ మూాడైంది. ఏంచేస్తున్నాడు వీడు యింతసేపూ!

గోపా—పొంచి రానా, బాబాయ్ చూసి వస్తా.
రాధా—వెళ్లు (పోతుంది).
(బాబాయ్ కాసేపు కూర్చొని వెనక్కి వాలి, పడకకుర్చీలో పడుకుంటాడు. నిద్రపట్టింది).
(రాధవచ్చి "బాబాయ్" అని పిల్చి పెట్టెలో చాకొలేటు గుడ్డలు తీసుకుపోతుంది. గోపాలం ఆగుడ్డలుకట్టుకొని వస్తాడు).
గోపా—బాబాయ్, బాబాయ్–
బాబా—ఆఁ!
గోపా—పిల్చావుటగా మాట్లాడాలని.
బాబా—ఆ–లేదే—ఎప్పుడు పిల్చాను.
గోపా—రాధ చెప్పిందిలే.
బాబా - ఏమని.
గోపా—తొందరగా రమ్మన్నావని.
(అని బల్లమీద పిస్తోలు తీసుకుంటాడు. జేబులో పెట్టుకుంటాడు. బాబాయి అదిచూచి కాస్త ఖంగారు పడ్తాడు).
బాబా—గోపాలం ?
గోపా—ఆ–ఏం ?
బాబా—ఆ–ఏం లేదు. అల్లాకూర్చో.
గోపా—పరాలేదు చెప్పు.

గోపా—మాటలా! ఏం లేదన్నావు?
బాబా—మరేం లేదులే; కూర్చో.
గోపా—ఆ. (కూర్చుంటాడు. బాబాయి కాసేపాగి).
బాబా—గోపాలం?
గోపా—ఏం బాబాయ్-(అసలేచి, జేబులో చెయ్యి పెట్టుకోగా)
బాబా—లేవక; కూర్చో-కూర్చో నేమాట్లాడదాం.
గోపా—(కూర్చుంటాడు).

బాబా—నీ చిన్నప్పుడే మీనాన్న యీ కరిణీకం, నాలైక రాల భూమీ, నిన్నూ, నాకు ఒప్పచెప్పి పోయాడు. ఆ కరిణీకంలోనే నాలైకరాలపొలాన్ని పద్దాలైకరాలు చేసాను. నిన్ను చదివించి పెద్దవాణ్ణి చేశాను.
గోపా—అవును.
బాబా—నేను పెద్దవాణ్ణి అయిపోయినాను; నువ్వా ఏదో Intermediate దాకా వచ్చావ్.
గోపా—ఆ.
బాబా—ఎందాకా చదివితే ఏం ప్రయోజనం-యీరోజుల్లో?
గోపా—అయితే నన్ను......(లేవబోగా.)
బాబా—అహహా!! చదవద్దంటం లేదు, చదివితే చదువుదు గానిలే; కూర్చో.
గోపా—ఊఁ...(కూర్చుంటాడు)
బాబా—నేననేదీ ఏంలేదు; నేనన్నీ ఆలోచించి ఏంవుద్దేశం పడ్డానంటే, ఏదో యింతవరకూ చదివావ్ గనక......
గోపా—(లేస్తూ) ఇహా చదువాపమంటావా?

బాబా—అహాహా! ఆపితే బాగుంటుందేమో ఆలోచించ మంటాను.

గోపా—ఆపి —. — ఏం చెయ్యను?

బాబా—అహాహా! నేనాపమన్నాననిగాదు. నీయిష్టం ఆలోచించుకో; ఇది నీడబ్బు-నీడబ్బుతో నువ్వు చదువుకుంటున్నావ్ వద్దనటానికి నేనెవర్ని?

గోపా—ఆపి-ఏం చెయ్యమంటావ్?

బాబా—ఆపితే-ఏదో-వుద్యోగంలో చేరవచ్చు.

గోపా—ఏం ఉద్యోగం?

బాబా—ఏదో వకవుద్యోగం! తాలూకాలో తాశిల్దారుతో చెప్పి వుద్యోగం యిప్పిస్తాను. మీనాన్న పేరుచెప్తే వుద్యోగాలకేం కొరతరాదు.

గోపా—అల్లాగే! ఏదన్నా చూడు-చేరతా.

బాబా—నువ్వుచేరతానంటే వుద్యోగానికేంరా! ఏ వుద్యోగం కావాలంటే అది యిప్పిస్తా.

గోపా—అంటే—?

బాబా—అంటే ఏ తాలూకాగుమాస్తో హైస్కూలురైటరో ఏదో?

గోపా—నేనూ......

బాబా—ఊఁ-పోనీ నీకేది కావాలో చెప్పు.

గోపా—అహా నేనూ?

బాబా—ఆ; అనుమానం ఎందుకూ ?

గోపా—నేనూ......పోన్లే బాబాయ్ నీ యిష్టం.

బాబా—నా యిష్టం ఏముందిరా! చేసేవాడివి నువ్వాయె.

గోపా—నేనూ!

బాబా—ఆ—మిలట్రీలో చేరతావా? పోనీ చేరు.

గోపా—కాదు బాబాయ్.

బాబా—మరి చెప్పు; అనుమానం ఏందుకూ ?

గోపా—ఇక్కడ మనవూళ్లో మంచి పెరుగు పాలూ దొరుకు తాయి బాబాయ్; బియ్యానికీ కరువుండదు.

బాబా—అందుకని?

గోపా— ఏవుద్యోగమైనా పరాయివూళ్లో బోలెడంత డబ్బు అద్దెలకి పొయ్యాలి.

బాబా—అవును అందుకని.

గోపా—అందుకని యీవూళ్లోనే వుండి కరిణీకం చేస్తా బాబాయ్.

బాబా—పోనీ అల్లాగే కానీ......

గోపా—కానీ......?

బాబా—దానికి Test అదీ Pass అవ్వాలిగదా?

గోపా—అల్లాగే Pass అవుతా, బాబాయ్.

బాబా—అయితే యిదెంతసేపు ? మనవాళ్ళలో పని 1st chance లోనే Pass చేయిస్తా.

గోపా—అల్లాగే బాబాయ్.

బాబా—ఇవ్వాళే అప్లికేషన్ పెట్టు.

గోపా—అల్లాగే.

బాబా—చూడూ! నువ్వూ పెద్దవాడి వయ్యావ్!

గోపా— అవును.

బాబా—పెద్దవాళ్ళయినకొద్దీ కాస్త జాగ్రత్త నేర్చుకోవాలి. ఆ జాగ్రత్త నిమ్మదిగా వస్తుందనుకో. ఈ లోపుగా ఆరోగ్యం కాపాడుకోవాలి.

గోపా—ఏమంటావ్ బాబాయ్.

బాబా—ఏం లేదు చుట్టలూ అవీ కాలిస్తే ఆరోగ్యం పాడై పోతుంది నాయనా; నీకిదివకే అలవాటైపోతే సరే. నువ్వు చేసేదీ లేదు-కానీ అలవాటు కాకపోతేమాత్రం......

గోపా—మానెయ్యమంటావా బాబాయ్-(జేబులో చెయ్యి పెట్టుకొని లేస్తాడు).

బాబా—అహాహ! అలవాటయితే మానద్దులే.

గోపా—అలవాటవలేదు. బాబాయ్! మానేస్తాలే.

బాబా—అల్లాగే నాయనా; వెంటనే మానలేకపోయినా నిమ్మదిగా.........

గోపా—ఎందుకూ? మానేస్తా. ఇహ కాల్చనుగా?

బాబా—బాగుంది; మంచిది; ఒరేయ్! నేనొక్కటి అడుగుతా చెప్తావ్?

గోపా—ఏమిటది (లేస్తూ)

బాబా—లేవకు కూర్చో; ఆ జేబులోది ఏమిటి?

గోపా—ఇదా? తుపాకీ. (తుపాకీ జేబులోంచి తీసి బాబాయి వైపే పట్టుకుని ఉంటాడు.)

బాబా—ఆ తుపాకీ బొమ్మదా? నిజం దేనా?

గోపా—అదా!

బాబా—అదేం కాస్త అటు తిప్పిపెట్టు.

గోపా—ఫర్వాలేదు. బాబాయ్! ఇది బొమ్మదే.

బాబా—అల్లాగా! నేను నిజం దనుకున్నా!! దాన్ని ఎందుకు కొన్నావ్?

గోపా—మన రాధ కిద్దామని కొనుక్కొచ్చా బాబాయ్.

బాబా—ఒకటి చాలదూ? రెండెందుకు కొన్నావ్.

గోపా—ఒకటే బాబాయ్. ఒక్కటే కొన్నాను.

బాబా—రెండులేవూ నీ దగ్గర?

గోపా—లేవే!!

బాబా—ఓహో అల్లాగా! సర్లే అయితే. ఇచ్చెయ్యి ఎందుకు నీ దగ్గరా!

గోపా—అల్లాగే! రాధా! రాధా (లోపలికి వెళ్తాడు)

[బాబాయి పడుకుంటాడు. లోపల "ఢాం" అని పేలుతుంది. అదిరిపడి బాబాయ్ లేస్తాడు. రాధ వస్తుంది. బాబాయ్ "ఎవరూ?" అని ఖంగారుపడి లేచి)

బాబా—నువ్వా!

రాధ—(వస్తూనే) ఇదిగో బాబాయ్; తుపాకీ అన్నయ్య నాకిచ్చాడు.

బాబా—అహా (సర్దుకుని) రాధా!

రాధ—ఆ.

బాబా—గోపాలం యిక్కడికి వచ్చాడు కాదూ?

రాధ—ఆ.

బాబా—వచ్చి నాతో మాట్లాడాడా?

రాధ—ఏమో బాబాయ్!

బాబా—మాట్లాడ లేదంటావా?

రాధ—మాట్లాడేవుంటాడనుకుంటా.

బాబా—మాట్లాడే వెళ్ళాడుగా!

రాధ—నే యిక్కడ లేను బాబాయ్; కాని యిక్కణ్ణించి వచ్చి యిది నాకిచ్చాడు.

బాబా—ఇక్కణ్ణించి వచ్చే యిచ్చాడుగా అదీ?

రాధ—ఆ.

బాబా—అయితే వచ్చినమాట నిజమేనన్నమాట.

రాధ—నిజమే అవచ్చు.

బాబా—నిజమేనా! కలగామాగా!

రాధ—ఏమో బాబాయ్.

బాబా—(మళ్ళీ అనుమానంలోపడి) వాణ్ణి వక్కసారి పిల్చుకురా! (రాధ వెళ్తుంది. బాబాయి ఆలోచిస్తూ పడు కుంటాడు.)

తెర



## పాత్రలు:

1 డాక్టర్—40 ఏండ్లవాడు
2 ఒకపేషెంటు-50 ఏండ్లవాడు
3 సంతోషం-శ్యామల భర్త
4 శ్యామల-సంతోషం భార్య
5 పేషెంటు కొడుకు-16 ఏండ్లవాడు
6 ఒక కుర్రవాడు—9-10 ఏండ్లవాడు

# మనసులోని మథన

[ఒక డాక్టరుగారి ఆఫీసుగది. వెనుకవైపు కాంపౌండర్ గది, దర్వాజా. ఆగదిలో సీసాలు మొదలైన సామగ్రి కనిపిస్తుంటాయి. ఎడమవైపు దర్వాజా మీద రెసిడెన్సు అని వ్రాసివుంటుంది. కుడివైపు బయటకు త్రోవ. గది అంతా డాక్టరు గదికి తగ్గట్టుగా అలంకరించి వుంటుంది. డాక్టరుగారు కుర్చీలో కూర్చొనివున్నారు. దగ్గరనే ఒక రోగి నిలబడి ఏవేవో చెప్పుచున్నాడు.]

ఒక పేషంట్—అన్నం తినంగానే వస్తుందండీ కడుపులోనొప్పి. అన్నం తినాలంటే మా చెడ్డ బాధైపోయిందండీ! తినకుండా వుండాలంటే ఆకలి. తింటే యీనొప్పి.

డాక్టర్—సరే ఈ మందు తీసుకో 4 [illegible] చెయ్యాలి తెల్సిందా, ఒట్టి పాలు త్రాగు. ఇంజెక్షన్ మళ్ళీ రేపిస్తా రా.

పేషంట్—అల్లాగే బాబయ్యా-బాబయ్యా అసలిది తగ్గుద్దా? లేకపోతే యీజన్మకింతేనా?

డాక్టర్—తగ్గుతుందిలే. పో మందు తీసుకో.

సంతోషం—(కంఠస్వరం) డాక్టర్ గారింకా బిజీగా నేవున్నారే!

డాక్టర్—ఓహో సంతోషం! రా రా! అరే మీ ఆవిణ్ణి కూడా వెంటేసుకు వచ్చావేం.

శ్యామల—ఆ! ఆ! చూచిపోదామని వచ్చాం. అక్కయ్య గారేరీ? లోపల వున్నారా?

డాక్టర్—ఆ! ఆ లోపల్నే వుంది. నీ అంత ఫార్వర్డుగా బయటికి రాదుగా.

శ్యామ—బయటికొచ్చి నేనేం బావుకుంటున్నానూ?

సంతో—ఇదిగో డాక్టరన్నమాటేమిటి? నువ్వు విసుక్కుంటున్న విసురేమిటి?

శ్యామ—నా విసురేముంది దీంట్లో.

సంతో—లేదూ! మద్రాసు వెళ్ళి యెగ్జిబిషన్ చూశివద్దామని మొదలెట్టింది డాక్టర్. "రెండు వందలెందుకూ అనవసరంగా ఖర్చు" అన్నా-అప్పట్నించీ మొదలెట్టింది సతాయింపు. "ఎంతసేపు తిరిగినా యీ వెధవ పార్కు-కేగా ఆ వెధవ రేకులడబ్బా సినీమాహాలేగా" అంటుంది. పార్కు లెండిపోక మనుషులెండిపోతారా! మద్రాసులో సినిమాహాల్సుపైన మాత్రం రేకులుండవా? నువ్వే చెప్పు.

డాక్టర్—మీరిద్దరూ యిక్కడ దెబ్బలాడుకోటానికి వచ్చారా ఏమిటి?

సంతో—లే! మీ భార్యాభర్తలు యిలాగే దెబ్బలాడుకుంటారేమో చూద్దామని వచ్చాం.

డాక్టర్—దెబ్బలాటలెందుకు సంతోషం. బ్రతికిన నాళ్ళు రోజులూ సంతోషంగా బ్రతికి బైట పడాలిగాని.

సంతో—ఆమాట దాంతో చెప్పు.

శ్యామ—ఎవరది-ఎవరో పేషంటు వస్తున్నాడు?

పేషంట్ కొడుకు—డాక్టర్ గారూ!-డాక్టర్ గారూ! నాన్నకి గుండె నొప్పి వచ్చిందండీ! మెలికలు తిరిగి పోతున్నాడు. బండిమీద తీసుకువచ్చాను.

డాక్టర్—లోపలికి తీసుకురండి.

పేషంట్ కొడుకు—రా లేడండీ చాలా బాధపడుతున్నాడు.

డాక్టర్—పదండి చూచివద్దాం.

సంతో—అతను తెలుసా? మన శంకరంగారి అల్లుడు.

శ్యామ—అల్లాగా.

సంతో—గుండె నొప్పట. అసలే ముసలాడు, చాలా బాధ పడుతున్నట్టున్నాడు.

శ్యామ—అదిగో ఉంగరాలు తిరిగిపోతుంటే.

సంతో—డాక్టరు పరుగెత్తుకొస్తున్నాడేమిటి!

డాక్టర్—కాంపౌండర్-కాంపౌండరు!

సంతో—ఎట్లావుంది.

డాక్టరు—అధ్వాన్నంగావుంది ఏడీ యితను. తొందరగా ఇంజెక్షన్ యివ్వాలి. వస్తానాగు.

శ్యామ—డాక్టరుకూడా యింత ఖంగారు పడ్తే ఎట్లా?

సంతో—ఈయనగారి మొహం చూస్తే ఆరోగి బ్రతుకుతాడా అని సందేహంగా వుంది.

పేషంట్ కొ॥—డాక్టర్ గారూ! డాక్టరుగారూ!

డాక్టర్—ఆ వస్తున్నా పదండి యింజెక్షన్ యిస్తా.
శ్యామ—పదండి ఈలోపున డాక్టరుగారి భార్యతో మాట్లాడి వద్దాం.
సంతో—ఆగు. ఆయన చావు బ్రతుకులమీద వుంటే.
శ్యామ—అయితే మాత్రం—మీరిక్కడెందుకూ డాక్టరుగారి ప్రక్కనుండి, డొక్క లెగ రేస్తారా.
సంతో—అహహా. నీ ప్రక్కనుండి తోలువాయిస్తా.
శ్యామ—ఆ మాత్రం చేతైతే యింకేం.
సంతో—ఏమన్నావ్ ?
శ్యామ—మాటకు మాట అన్నా-
సంతో—మొగుడనీ మొద్దులనీ లేదు పరాయివాళ్ళు ఎవరన్నా వింటారన్నా లేదు.
శ్యామ—తప్పేమన్నాను. డోలులాగా నా ప్రతిమాటక్కు తాళం వేస్తే ఎప్పుడో బాగుపడేవారన్నా.
సంతో—ఆ-ఆ పెళ్ళాం మాటవిని బాగుపడ్డవాళ్ళందరూ కోర్టులకెక్కి దివాళా అర్జీలు దాఖలు చేస్తున్నారు. పోయినమాటు.
శ్యామ—పోన్లెండి. అప్పటికన్నా కళ్ళు తెరచి బుద్ధి తెచ్చుకున్నారు.
సంతో—'ఇస్కో' అంటే చాలు గెయ్యాని లేస్తావ్.
శ్యామ—మీరు యిస్కో అంటేనేగా.
సంతో—చాల్లే వూరుకో డాక్టరుగారు వస్తున్నారు. ఎట్లా వుంది డాక్టర్.

డాక్టరు—ఫర్వాలేదు కాస్త తగ్గిందట.

పేషంట్ కో॥—కాస్త తగ్గిందంటున్నారు. కాని దీనికి మీ రేదన్నా మందు చూడాలి డాక్టరుగారూ.

డాక్టరు —దానికి, మందేమీలేదు నిజం చెప్పాలంటే దీనికి మందు లేదు. ఇట్లా ఉపశాంతిగా ఏదో వాడటమే.

పేషం కో॥—ప్రాణాపాయం లేదుగదా ?

డాక్టరు—ప్రాణాపాయమా; వుంది. క్షమించండి. ఉన్న దున్నట్లుగా చెపుతున్నాను. ఈజబ్బు నాకువచ్చినా ఇంత కంటే చేసేదేం లేదు. దుఃఖం,విచారంలాంటి వేం లేకుండా విశ్రాంతిగా కాలం గడపాలి. అంతే. వారిని తొందరగా తీసుకెళ్ళండి. ఆ బండిలో ఎంతసేపుపడుకుంటాడు.

పేషం కో॥—సాయంకాలం మీరల్లా వచ్చినప్పుడు ఓమారు చూడాలి.

డాక్టరు-—అల్లాగే వెళ్ళి రండి.

శ్యామ—ఆమాత్రం ప్రాణం రక్షించలేని డాక్టర్లు ఏం డాక్టర్లు.

సంతో—మొదలెట్టావ్! డాక్టర్! నీప్రాక్టీస్ చూడు నిమిషాల్లో నీరసంచి పోవాలంటే ఏమక్కర్లే! దీన్ని నాలుగు రోజులు యీ ఆస్పత్రిలో ఉండనియ్యి.

డాక్టర్—నేనుండనిస్తా సరే-మరి నువ్వా పాపం.

శ్యామ—ఆయన కేంబాధ ? నాల్గు రోజులు తప్పినా చాలు నని హాయిగావుంటారు యింట్లో-వంటరిగా.

సంతో—ఉంటూ ఉంటూ! చాల్లేనడు. అక్కగారితో కూడా మాట్లాడి తొందరగా పోదాం.

డాక్టరు—తొందరెందుకులే! కూర్చోండి! చాలారోజులకు వచ్చారు. సరదాగా కాసేపు కబుర్లు చెప్పు శ్యామలా.

సంతో—కబుర్లా! దాని కవ్వేం చేతకావు. గిల్లి కజ్జా పెట్టుకుని.

శ్యామ—ఇదిగో. పబ్లికు ఆస్పత్రి అయిపోయింది. గాని లేకపోతేనా......

డాక్టరు—పోనీ లోపలికి పోదాం (అందరూ నవ్వారు) అబ్బ! మీరున్నారుగనక ఆరోగిని మర్చిపోయి ఇల్లాకబుర్లు చెబుతూన్నాను లేకపోతే ఆయన్ని తల్చుకుని తల్చుకునీ యివ్వాళ నామతి పొయ్యేది.

సంతో—ఏం? ఆయన-కొంపదీసి-లాభం లేదా!

డాక్టర్—ఇప్పుడే ప్రమాదం లేదుగాని ఎప్పుడో ఏకోపం లోనో దుఃఖం లోనో హరీ అంటాడు.

శ్యామ--పాపం.

డాక్టరు—ఆయన కేంలే పెద్దవాడు-పిల్లల్ని పెద్దవాళ్ళని చేశాడు. ఇంత సంపాదించి పడేశాడు. మనబోటివాళ్ళంటే అదీ లేదుగానీ.

సంతో—అదేమిటి నీకుమాత్రం ఏం?

డాక్టరు—మనమా! బ్రతికున్నన్నాళ్ళూ ఫర్వా లేదనుకో! కాని యిల్లా ఎన్నాళ్ళు సంపాయిస్తే పిల్లలిద్దరూ పెద్ద వాళ్ళు కాను.

సంతో—ఎవరో కుర్రవాడు వస్తున్నాడు.

డాక్టర్—ఎందుకబ్బాయ్?

కుర్ర—చదువుకుంటున్నానండీ; జీతం కట్టాలండీ; జీతం కట్టక పోతే పేరు కొట్టేస్తారండీ.

సంతో—ఊ! ఒకపావలా యియ్యి శ్యామలా.

డాక్టర్—ఆగు శ్యామలా! ఇటురా! యిది పట్టుకెళ్ళు.

సంతో—అదేమిటి 5 రూ॥ యిస్తున్నావ్.

డాక్టరు—తీసుకెళ్ళనీ; పోరా-పో-

సంతో—ఇదేమిటి కాకపోతే రూపాయి యివ్వచ్చుకాని అయిదా!

డాక్టర్—పోన్లే! తీసుకుపోనీ! రేపు నేను ఎప్పుడో గుటుక్కు మంటే నాపిల్లలూ యిలా కాగితం పుచ్చుకుని ... ...

సంతో-శ్యామ—డాక్టర్!

డాక్టర్—ఎప్పుడన్నా వాళ్ళు వస్తే లేదనకుండా ఒక్క-పావలాఅన్నా పారెయ్ సంతోషం.

సంతో—ఏమిటిది! నీకేమన్నా మతిపోయిందా.

డాక్టరు—మతి పోవటంలేదు—నీకు తెల్సు నాభార్య ఉత్త తెలివితక్కువ దద్దమ్మ. నే సంపాదించిపెట్టిన దంతా-పోయింతర్వాత—మూడు నెలలాగదు.

శ్యామ—బాగానేవుంది! కులాసాగా ఖబుర్లు లోపలికి పోదాం రండి.

సంతో—రా, (లోపలికిపోయి).....

డాక్టరు—ఫర్వాలేదు కూర్చోండి.

శ్యాము— ఎందుకు కూర్చోవటం? లేచే కూర్చున్నాను. కళ్ళనీళ్లు తెచ్చుకోవటానికా.

సంతో— కనికన్నా-దెబ్బలాడుకున్నా మంచిదే.

శ్యాము—బాగా చెప్పారు అనవసరంగా సుఖంగా వున్న ప్రాణాన్ని కష్టపెట్టుకోవటం.

డాక్టరు—సుఖం ఎక్కడుంది?-ఏదో సరదాగా కూర్చుని మాటలాడుకోవటంలో తప్పు.

సంతో—నువ్వు యింతవరకూ బాగానే ఉంటున్నావ్. ఈనిరాశంతా గుండెల్లో ఏమూల దాచుకున్నావ్.

డాక్టరు—నిరాశ కాదుసంతోషం నే ననేది.

సంతో—కాదంటావేం-రోజుకు-40,50, సంపాదిస్తున్నావ్-కాస్తా కూస్తా నిలవేస్తున్నావ్-నీకంటే బాగా బ్రతుకుతున్న వాడెవడు చెప్పూ.

డాక్టరు—బ్రతుకుతున్నాను. డబ్బు సంపాదించి నిలవేస్తున్నాను. దగ్గరకొచ్చిన ప్రతిరోగిని పిండి, పీల్చి, నిలవేస్తున్నాను. నిలవేసింది చాలదేమోనని జీవితాన్ని ఇన్స్యూరు చేశాను. జీవించి వున్నంత వరకూ కావలసినంతా జాగ్రత్త తీసుకుంటాను. కాని, యీజీవితం ఎంతలో ఆరిపోతుందంటావ్?

సంతో—డాక్టరువి; నువ్వే అట్లా అంటే-యిక మేమేమంటాం,

డాక్టరు—డాక్టర్ని గనకే యిట్లా అంటున్నాను. లేకపోతే నేనూ శ్యామలకుమల్లే "మద్రాసు ఎగ్జిబిషనుకు పోదాం అవ్వీ యివ్వీ కొందాం" అనేవాణ్ణే.

సంతో—(శ్యామలతో) చూశావా? డాక్టర్ ఏమంటు న్నాడో?

శ్యామ—ఆయనేదో అంటాడు. ఆయనకేం తెల్సు మీతో ఎగ్జిబిషనుకు వెళ్ళినా రత్తన్ బజారు వెళ్ళినా, వట్టి చేతుల్తో తిరిగి రావటమేనా?

సంతో—ఎగ్జిబిషనుకు వెళ్ళి, రత్తన్ బజారుకువెళ్ళి అక్కడ కొనాలికూడానా.

డాక్టరు—కొనకుండా వెళ్ళడం ఎందుకూ?

సంతో—ఎగ్జిబిషన్ కి.

డాక్టరు—ఈ కుర్రాడు మళ్ళా వస్తున్నాడెందుకూ?

శ్యామ—ఎవరూ?

సంతో—అతనే. ఇందాక ఆ రోగితో రాలే. శంకరంగారి అల్లుడు.

పేషంట్ కొ॥—మా మామగారు, శంకరంగారు ఒక్కసారి మిమ్మల్ని పిల్చుకురమ్మంటున్నారండీ, యిప్పుడే ఒకసారి రావాలి.

సంతో—నన్నా? పదండి వస్తా.

శ్యామ—మీరొచ్చేదాక నే నిక్కడేవుండనా?

సంతో—ఆ వుండు—కాని డాక్టరుతో దెబ్బలాడకు, (అందరూ నవ్వారు)

డాక్టరు—(నవ్వుతూ) అబ్బా (అన్నాడు)

శ్యామ—ఆ! అదేమిటీ! అల్లా గుండెలు పట్టుకున్నారేం.

డాక్టర్—ఏంలే! ఆ శ్యామలా! (కోలుకొని) మీ దంపతులిద్దరూ మాటల్లో పోట్లాడుకున్నా-తర్వాత సరిగ్గానే వుంటారుగా?

శ్యామ—అలా అడిగారేం?

డాక్టర్—అహ యింకా పిల్లా జెల్లా లేరుగా, అందుకని.

శ్యామ—అదికూడా ఎందుకులెండి-యిప్పట్నించీ.

డాక్టరు—అవున్లే! హాయిగా ఎగ్జిబిషన్‌కి వెళ్ళటానికి వీల్లేకుండా.

శ్యామ—అల్లా అంటారేం? పిల్లలుంటే వెళ్ళకూడదా! మాకసలు పిల్లలతో వెళ్ళడమంటేనే సరదా.

డాక్టర్—అలాగా!

శ్యామ—బజారుకు వెళ్ళినా, సినిమాకు వెళ్ళినా యిక్కడికొచ్చి మీపిల్లల్ని కూడా తీసుకెడదామంటా రాయన. కాని రావటానికి కుదరదు.

డాక్టర్—సరదాగా పిల్లల్ని వెంటేసుకు తిరిగితే బాగానే వుంటుందికాని వాళ్ళ భవిష్యత్తు తల్చుకుంటేమాత్రం...

శ్యామ—అదుగో మళ్ళీ...అయితే నే వెళ్ళిపోతా.

డాక్టర్—వెళ్ళకు.

శ్యామ—మరయితే యింట్లోకి పోదాంరండి. మీకిక్కడుంటే, యివ్వాళంతా యీ మాటలే వస్తున్నాయి.

డాక్టర్—వద్దు లోపలికెళ్తే వాళ్ళు కళ్లబడతారు. మనసులో బాధ-మరీ ఎక్కువవుతుంది.

శ్యామ—మీ మనసుకు బాధా! ఏమిటీ యిది?

డాక్టర్—ఊరికే అంటున్నాను శ్యామలా! ఏవో బాధలు అందరికీ వుంటాయి, అంతే భయపడకు.

శ్యామ—కాని నాకు మీబాధేమిటో అర్థం కావటంలేదు.

డాక్టరు—బాధలేని మనిషి వుంటాడా?

శ్యామ—డాక్టరుగారూ మీ బాధేమిటో నాతో చెప్పక తప్పదు.

డాక్టరు—నీతో చెప్పేది కాదులే అది.

శ్యామ—ఆ

డాక్టర్—నా బాధ నామనస్సులో వుంచుకోవలసిందే ఆజన్మాంతం.

శ్యామ—అయితే.

డాక్టర్—ఏంలేదు శ్యామలా. నేనన్నదిమర్చిపో. యిక ఆ మాటలు రానివ్వద్దు. పద లోపలికిపోదాం. అందరూ వుంటారు.

శ్యామ—ఐతే మీరింకా మర్చిపోలేదన్నమాట.

డాక్టర్—ఏం మర్చిపోలేదంటావ్?

శ్యామ—కాని-కాని- అయిపోయిందానికి – అనుకుని ఏం ప్రయోజనం? ఇకనన్నా అంతామర్చిపొండి. కావాలంటే నేను మీకు కనపడకుండా పోతాను.

డాక్టర్—కాదు శ్యామలా.

శ్యామ—జీవితంలో అంతా అదృష్టమే అనుకోటానికివీల్లేదు. "అదృష్ట మదృష్టాల బంతులాట" జీవితం. ఆ పిల్లల్ని యీ చేతుల్తో పెంచే అదృష్టం నాకు లేదు. మన దురదృష్టం కొద్దీ మన పెళ్ళి తప్పిపోయింది.

డాక్టర్—కాదు శ్యామలా నీ అదృష్టం కొద్దీ పెళ్లి తప్పి పోయింది.

శ్యామ—ఏమంటూరూ?

డాక్టరు—ఆనాడు మన పెళ్లి తప్పిపోయింది. ఆనాడే నీఅదృష్టం పండింది. నీకు తెలియదు. ఆనాడు కాలసర్పంలాగా కర్మ నీఅదృష్టాన్ని కాటువేయటాన్కి కాచుకూర్చున్న సంగతి నీకర్థంకాదు. నీ మనసు నాకు తెల్సు......... కాని

శ్యామ— తెలిసేనా యిట్లా అంటున్నారు? మనసున్న మనిషి కోసం ప్రాణమివ్వటంగూడా ఒక ఆనందమనుకుంటాను.

డాక్టర్—అవును. ఆనందమే. కాని "మనసున్న మనిషిని తీసుకుపోయి నట్టేటముంచటం" ఆనందంగాదుగా.

శ్యామ—ఏమిటి మీారనేది?

డాక్టర్—నే ననేది నీకు తెలియదు-శ్యామలా! కాని నేనే నిన్ను పెళ్ళిచేసుకుంటే నీజీవితాన్ని అధోగతి పాలుచేసే వాణ్ణి. ఆమాట మాత్రం నాకు బాగా తెల్సు.

శ్యామ—అధోగతికి భయపడి పారిపోవడం మాత్రం నాకిష్టం లేదు. అందుకనే నాకు కష్టంగావుంది.

డాక్టర్—ప్రేమించిన పిల్లను అధోగతిపాలు చేయటం నాకు ఎప్పుడూ యిష్టంలేదు. అందుకనే నాకు సంతోషంగావుంది. శ్యామలా యిందాక వచ్చిన గుండెజబ్బు రోగిని చూశా రుగా! ఆ జబ్బు నాకూవుంది.

శ్యామ—మీకా! ఆ జబ్బా!

డాక్టర్—అదే! అందువల్లే, నాకీబాధ–నాకీ నిరాశ.

శ్యామ—ఆహా.

డాక్టర్—ఎప్పుడీ ప్రాణాలు గాలిలో కల్సిపోతాయో తెలి యదు, యివ్వాళో–ఏవేళో.

శ్యామ—ఇహ ఊరుకోండి.

డాక్టరు—ఊరుకోవటానిక్కాదు. ఆరోజు ఎప్పుడొచ్చినా పిల్లల్ని నీవాళ్ళనుగా చూసుకో. అందుకే ఇదంతా చెప్తున్నాను.

శ్యామ—మీరేంబెంగపడకండి. అంత దురదృష్టం మన్ని కప్పి వేయకుండా భగవంతున్ని ప్రార్థిద్దాం.

డాక్టరు—అంతకంటె చేసేదేం లేదు. గాని పాపం "అయన" మాత్రం–ఏంచేయ గలడు.

శ్యామ—అయితే ఎప్పుడో వకప్పుడు తప్పదంటూరా?

డాక్టరు—నేను డాక్టర్ని. శ్యామలా! నాసంగతి నాకు తెలి యదా? నాపేరు చిత్రగుప్తుని చిత్తాలో గుప్తంగా చిత్రించి వుంది. నారోజుకోసం నేను కాచుకున్నాచ్చున్నాను. అంతే.

శ్యామ—అయితే నేనిక్కడనే వుండి మిమ్మల్ని కనిపెట్టి వుంటాను.

డాక్టరు—వద్దు. నువ్వొకనిపిస్తుంటే యీ ధోరణి మర్చి పోలేను. అంతా మర్చిపోయి మామూలుగా వుండు. చాలు.

శ్యామ—అయితే మీరు ఒక మాటివ్వాలి నాకు.

డాక్టరు—ఏమిటది ?

శ్యామ—మీ కేమన్నా అనుమానంగా వుంటే నాకు కబురు చేస్తానని మాటివ్వండి. మీ సౌఖ్యంతో పాలుపంచుకునే భాగ్యం లేకపోయినా దుఃఖంలో వంతు పంచుకున్నా సుఖపడ్తాను.

డాక్టరు—శ్యామలా! శ్యామాలా! నాకు తెలుసు. శ్యామలా నీ మనసెంతో మధురమైంది. చిరకాలం, నామరణానంతరం కూడా మధురంగానే వుండనియ్యి.

శ్యామ—అబ్బా యెప్పుడూ "మరణం మరణం" అంటూ మరింత మంట పెట్టకండి.

డాక్టరు—చూస్తూ ఈ పిల్లల ఫోటో నీకంద చేసిన వేళ, వాళ్ళ బాధ్యత నీకప్ప చెప్పుతున్నానన్న మాట. నా బాధ్యత వదలు కుంటున్నానన్న మాట.

శ్యామ—అబ్బా !

(సంతోషం మాటలు వినిపించి అటుచూస్తారు.)

సంతో—మీరింకా కబుర్లలోనే వున్నారూ? అదేమిటి అల్లాడిగాలుపడి వున్నారేం ? తప్పిపోయిన మీ పెళ్ళి జ్ఞాపకంరాలేదు గదా?

శ్యామ—ఆగండి వేళాకోళానికూడా వేళాపాళా వుండాలి.

సంతో—అదేమిటి? ఇప్పుడు వేళ కాదా?

డాక్టర్—వేళసంగతి కేంలే; ఇంతకూ నీకు కబురెట్టా రెందుకు?

సంతో—ఏంలే! నువ్వన్నమాటల్తో ఖంగారుపుట్టి శంకరం గారితో మొరపెట్టుకున్నారు. నేను నీకు రికమెండ్ చెయ్యాలిట కాస్త శ్రద్ధగా చూడమని.

డాక్టర్—నేను శ్రద్ధగా చూడాలీ!

సంతో—ఆ; శ్రద్ధగా చూసి మంచి మందు చెయ్యమన్నాడా శంకరం.

డాక్టర్—చాలా బాగుంది. దానికి మంచిమందు వుండాలిగా!

సంతో—మందే లేదా?

శ్యామ—ఉంటే తీసుకోమూ?

సంతో—ఏమిటో నువ్విట్లా అంటావు. మరాయన నొప్పిపోయి బాగానే వున్నాడే యిప్పుడు.

డాక్టర్—ఇప్పటికి అదృష్టవంతుడు.

సంతో—అయితే నొప్పి మళ్ళీ రావచ్చా?

శ్యామ—ఆ వచ్చి, చచ్చిపోవచ్చుగూడా.

సంతో—అరే! తప్పదన్నమాట దురదృష్టం.

శ్యామ—ఇహ లోపలికిపోదాం రండి; ఇక్కడే కూర్చుంటే ఎప్పుడూ యీ రోగాలగోలే.

సంతో—లోపలికెళ్ళి యింకోగంటచేస్తావ్—ఇహ యివ్వాళ ఇంటికెకకూడా రావా ఏం?

శ్యామ—అప్పుడే ఎందుకూ? ఇంకా పిల్లల్నన్నా చూడలేదు. తొందరగా వుంటే మీరు పొండి.

సంతో—అయితే ఇక్కడే కలకాలం వుండిపోయేట్లున్నావే?

శ్యామ—అంత అదృష్టంకూడానా?

సంతో—సరిసరి అనుకున్నంతా అయింది. డాక్టర్‌గారేదో మందువేశారు.

శ్యామ—నేనేం మందులకు లొంగేమనిషినిగాను.

సంతో—నాకు తెలియదూ, మాటలకూ మానులకూ లొంగుతావా? బడితపూజ చేస్తేగాని లొంగవ్.

శ్యామ—ఆ మహా చేసేవాళ్ళే తయారయ్యారు. అనవసరపు మాటలు. లోపలికెళ్లి అక్కగార్ని చూసన్నా వస్తా.

సంతో—తొందరగా రామరి. చూడూ! పిల్లల్నిట్లాపంపు. కాసేపు వాళ్ళతో నేనూ కబుర్లు చెప్తా.

శ్యామ—ఆ-అల్లాగే.

డాక్టర్—ఒద్దులే-శ్యామలా! వాళ్ళ నిక్కడికి పంపకు.

సంతో— ఏం?

డాక్టర్ —ఏం లే; ఒద్దులే.

సంతో—వాళ్ళతో కబుర్లు చెప్పందే నాకూ వచ్చినట్లూ వెళ్ళినట్టూ వుండదు.

డాక్టర్—కాని యివ్వాళ వద్దులే. (శ్యామల లోపలకు వెళ్తుంది)

సంతో — అదేమిటి! నాకూ శ్యామలకూ కూడా పిల్లలంటే యిష్టం లేదు. శ్యామలమల్లే నీ పిల్లలే నీ కిష్టంలేదా, ఏ పిల్లలయినా అంతేనా!

డాక్టర్ — శ్యామలకు పిల్లలంటే యిష్టం లేదా!

సంతో — ఇష్టం లేకేం! పిల్లలంటే యిష్టమే గాని, నిజం చెప్పాలంటే మా పిల్లల్ని కొంచెం దూరంగానే వుంచుతుంది.

డాక్టర్ — ఆ!

సంతో — ఎందుకనో నాకుం తెలియదు గాని, ఇహ ఎక్కడైనా ఏ పిల్లల్ని చూసినా వదిలిపెట్టదు.

డాక్టర్ — అల్లాగా!

సంతో — చూడరాదూ! వచ్చినప్పుడల్లా పిల్లల్ని నే దగ్గరకు తీసుకుంటూ గాని తను దగ్గరకు తీసుకోదు. దీనికి కారణ మేమిటో నాకూ తెలియదు.

డాక్టర్ — కాని ఈసంగతి నేను గమనించలేదే.

సంతో — నే మొదట్నించీ గమనిస్తూనే వున్నా—సరదాగా పిల్లల్ని సినిమాకి తీసుకెళ్దామే అంటే వద్దు లెమ్మని, ఎప్పుడూ తోసి పారేస్తుంది.

డాక్టర్ — కారణ మేమిటో!!

సంతో — కారణమూ! కారణానికి, నాకొక్కటే తోస్తుంది.

డాక్టర్ — ఏమిటది?

సంతో — నువ్వేం అనుకోకుండా వుంటే చెప్తా—శ్యామల నిన్ను ప్రేమిస్తోంది.

డాక్టర్ — ఆ.

సంతో — దాని మనస్సు నేకనిపెట్టి చూశాను. మీ పెళ్ళి తప్పిపోయి, మాకిద్దరికీ పెళ్ళయిందా! అయినా బాగానే వుండేది. మొదట తర్వాత నీకుపిల్లలు పుట్టుకా అప్పట్నించీ మీసంసారమంటేఎందుకో దానికిచీకాకు బయలుదేరింది. నేనప్పటినుంచి కనిపెడుతున్నాగా! తనకు పిల్లలు లేరని ఈర్ష్యో, విచారమో తెలియదు. అందాకా ఎందుకూ? పిల్లన్ని నే నెత్తుకున్నా దాని మొహం అదోమాదిరిగా మారిపోతుంది.

డాక్టర్ — నిజంగానా!

సంతో — స్త్రీమనస్తత్వమే అంత. ఊరకే నోరుపారేసుకుంటుంది గాని, మనసుమాత్రం మహామెత్తన. నిజానికి — నీ పిల్లల మీద కోప్పడితే తనకి పిల్లలు కలుగుతారా?

డాక్టరు — అబ్బా!

సంతో — నీమనసుకు కష్టంగా వున్నట్టుంది. మర్చిపో ఇదంతా అనవసరంగా వాగేస్తున్నాను.

డాక్టర్ — కాదు. ఈగుండెల్లో ఏదో కలుక్కుమంది.

సంతో — చిక్కపట్టిందా, ఏం తినలేదుగా?

డాక్టర్ — కాదు. గుండెల్లో ఏదో గుచ్చుకున్నట్టుంది.

సంతో — ఇందాక గూడా అట్లాగే అన్నావ్.

డాక్టర్ — ఆ! మళ్ళీవచ్చింది. అక్కడ ఇంజెక్షన్ యిచ్చే సిరంజి పట్రా తొందరగా, తొందరగా తెచ్చియ్యి—అబ్బా. (బాధపడ్తాడు.)

సంతో — (పట్టుకువచ్చి) ఇదిగో; నువ్వే తీసుకుంటావా ఇంజెక్షన్?

డాక్టర్ — ఆ.

సంతో — అయితే శంకరంగారి వియ్యంకుడి జబ్బు?

డాక్టర్ — ఆజబ్బే-అబ్బా-ఆయన మాదిరే నేనూ-ఎప్పుడో ఒకప్పుడు (ఇంజెక్షన్ తీసుకుని) ఇంద యీ ఇంజెక్షన్ సిరెంజి అక్కడ పెట్టెరా!

సంతో — ఆ అల్లాగే (సిరంజిలోపల పెట్టివచ్చి) తగ్గిందా!

డాక్టర్ — ఇంకా లేదు, అబ్బా అబ్బ.

సంతో — శ్యామల్ని పిల్లల్ని పిలుద్దాం.

డాక్టర్ — వద్దు.

సంతో — లోపలికి పోయి పడుకుందువుగాని పద.

డాక్టర్ — వద్దు. అక్కడ వాళ్ళందర్నీ చూస్తుంటే బాధ ఎక్కువౌతుంది. అబ్బా! యింకా యెక్కువౌతోంది. ఇప్పుడే ప్రాణం పొయ్యేటట్టుంది.

సంతో — ఇంకెవరన్నా డాక్టర్ని పిలుద్దామా?

డాక్టర్ — లాభంలేదు. బాధ రాకుండా వుండాలంటే విషం పుచ్చుకు చచ్చిపోవాలి - అంతే.

సంతో — కాదు. ఎవర్నైనా పిలుద్దాం, కాస్త ధైర్యంగా వుంటుంది.

డాక్టర్ — అక్కర్లే. ఒకపనిచెయ్యి-లోపల నా BAG లో ఒక ఎర్రసీసావుంది. యిట్లాయియ్యి.

సంతో — ఆ (లోపలకువెళ్ళి ఒకఎర్రసీసాతెచ్చి) ఇదేనా ఏదో Poison అని వ్రాసివుంది!

డాక్టర్—ఆ. అదే. ఇట్లాయియ్యి. ఇన్నినీళ్లు—నీళ్ళుకూడా!
సంతో—(తెచ్చి ఇస్తో)
డాక్టర్—దాంట్లో పదిబొట్లువెయ్యి. నాచెయ్యివణుకు తోంది. ఎక్కువ వెయ్యకు. ప్రాణమోసం. అహా! కాదు. నేనే కావల్సినంతా వేసుకుంటాను. ఇట్లాయియ్యి.
సంతో—నీచేతులు వణుకుతున్నాయి.
డాక్టర్—ఫర్వాలేదు. ఎక్కువపడితే మరీహాయి. ఒక్క సారిగా చస్తాను. అంతేగా! ఇయ్యి. వద్దులే. వద్దులే. ఎక్కువపడితే పిల్లలు అన్యాయమై పోతారు. నువ్వే వెయ్యి. (సంతోషం పదిబొట్లువేసి మందుయివ్వబోతుంటే) పదిబొట్లేగా. ఎక్కువ వెయ్యలేదుగా యియ్యి తాగేస్తాను.
సంతో—ఇంద. (ఇస్తాడు)
డాక్టర్—నువ్వొకసారి—లోపలికెళ్ళి - శ్యామలేంచేస్తోందో- పిల్చుకురా.
సంతో—ఆ అల్లాగే.

[సంతోషంవెళ్ళి తిరిగిరాగా]

డాక్టర్—అబ్బా! అబ్బా! అబ్బా! అబ్బా! వచ్చావా! ఏదీ శ్యామల? శ్యామల రాలేదింకా.
సంతో—పిల్లలకు అన్నంపెడుతోంది. తొందరగా రమ్మని చెప్పొచ్చాను.
డాక్టర్—పిల్లలకి—అన్నంపెడుతోందా, పిల్లలకా!!
సంతో—నీపిల్లల మీద ఎన్నడూలేనిముద్దు యివ్వాళ పుట్టు కొచ్చినట్టుంది. ఎత్తుకుని తినిపిస్తోంది.

డాక్టర్—నిజంగా నేనా ! నిజంగానా ?

సంతో—నిజంగానే; దీంట్లో అబద్ధమెందుకూ చెప్పటం.

డాక్టర్—అయితే నీమాట అబద్ధం-శ్యామలకు పిల్లలంటే అసహ్యంలేదు- అసహ్యంలేదు శ్యామలకు-అబ్బా !!

సంతో—ఇంకానొప్పి తగ్గలే.

డాక్టర్—తగ్గుతుందిలే. అదేతగ్గుతుంది నువ్వెళ్లు. కాసే పిక్కడపడుకుంటాను. విశ్రాంతిగా నువ్వు శ్యామలదగ్గర కెళ్ళి యీ Photo శ్యామలకియ్యి. నాపిల్లల Photo శ్యామలకియ్యి. పో. పిల్లలకి అన్నంపెట్టిన తర్వాత అందరూరండి. అంతా కలిసిరండి.

సంతో—అల్లాగే ! ఆమందు తాగు. (సంతోషంలోపలకు వెళ్తాడు.)

డాక్టర్—మందుతాగుతాను- మందుతాగుతాను. శాశ్వతంగా నొప్పి ఆగిపోయ్యేటట్లు తాగుతాను. (మందుసీసా వంచి బాగామందు వేస్తాడు) అబ్బా !-అమ్మా ! అబ్బా- అబ్బా- అబ్బా- (కాసేపటికి సంతోషం వచ్చిపడివున్న డాక్టర్ని చూసి)

సంతో—ఇదేమిటి Doctor!- Doctor!- Doctor! (మందు సీసానుచూసి) శ్యామలా ! శ్యామలా ! శ్యామలా !

శ్యామల—(వచ్చి) ఏమిటి! ఎందుకూ అంత ఖంగారుగా ?

సంతో—చూడు. Doctor విషం తాగేశాడు. సీసాలో సహాంవిషం పోసుకుతాగాడు. చేతులువణికి ఎక్కువ పడింది కాబోలు,

శ్యామ—ఆ.

సంతో—పదిబొట్లకంటే ఎక్కువగా ఆపుంచువాడకూడదట. నేను పదిబొట్లువేసి ఇచ్చా. నే ఇచ్చేటప్పుడు సీసా యింత ఖాళీగా లేదు.

శ్యామ—ఇంత బాధలో ఒదిలి మీరు నా దగ్గర కెందుకు వచ్చారూ ?

సంతో—ఈ Photo నీకిచ్చిరమ్మన్నాడు—అందుకని ?

శ్యామ—నాకు Photo ఇచ్చిరమ్మన్నాడా !

సంతో—ఆ. నువ్వు పిల్లలకు అన్నం పెడుతుంటే తర్వాత యిద్దాం లెమ్మనుకున్నాను.

శ్యామ—అయితే !

సంతో—తిరిగి వచ్చి చూచేలోగా యిలా ప్రమాదం జరిగి పడివున్నాడు.

శ్యామ—ప్రమాదం కాదు ఇది ఆత్మహత్య.

సంతో—ఆత్మ హత్యా !

శ్యామ—అంతే. ఆ Photo ఇట్లా యివ్వండి. ఇహాయీపిల్లల బాధ్యత మనమీాదవుంది.

—: తె ర :—



# ఎందరో మహానుభావులు

(శ్రావ్య నాటిక)

## పాత్రలు:

1 జోగాపరమానందయ్య-ఒక భక్తుడు

2 ఒక వర్తకుడు

3 ఒకడు

4 రెండవవాడు

5 మూడవవాడు

6 రైతు

7 నాలుగవవాడు

8 అయిదవవాడు

# ఎందరో మహానుభావులు

[జోగా పరమానందయ్య అనే భక్తుని భగవద్గీతా పారాయణ వినిపిస్తుంటుంది. కొంచెం సేపటికి పరమానందయ్య కంఠస్వరం దూరంగా వినిపిస్తుంది.]

ఒకవర్తకుడు—ఎవరండీ, ఎవరా మహానుభావుడు గీతా పారాయణంలో పరవశిస్తూ పోతున్నాడు.

ఒకడు—ఆయనాండీ, జోగాపరమానందయ్యాగారని యీ వూళ్ళో పనిలేని భక్తుల్లో ఒకడు.

వర్త—ఇంకా తెల్లార్లేదు. అప్పుడే పారాయణ చేసుకుంటూ బయలుదేరారేం?

ఒక—ఊళ్ళోవాళ్ళు పడుకోవటం యిష్టంలేక ఆయన సలా రాత్రింబగాళ్ళా పారాయణ చేస్తూనే వుంటాడు.

వర్త—అల్లా అంటారేం ?

ఒక—ఎల్లా అనమంటారు. భగవద్భక్తి ఉండాల్సిందే కాని దానికి మాత్రం వేళాపాళా వుండక్కర్లే. ప్రొద్దున్నే లేచి పనిపాటలు చూచుకోవాల్సిన వాడైతే ఈ పాటలు పెట్టుకు కూర్చుంటాడా ?

వర్త—అట్లు అనకండి. పనిపాటలు అందరికీ వుంటాయి. యోగి అయినవాడు వాటిని వదలించుకోవాలి.

రెండవ—ఈయన యోగి కాడు భోగి (అందరూ నవ్వుతారు) ఉన్నది మొగుడూ పెళ్ళాం కనక రెండు వీధులు తిరిగి

జోలెనింపుకుంటూను. పాటపాడుతూ కాలం గడుపుతాడు. ఇద్దరు పిల్లలు కలిగితే తెలిసేది భగవద్గీతా మహాత్మ్యం.

వర్త—అదేమిటి శ్లోకం చదివి సాష్టాంగ నమస్కారం చేస్తున్నాడు.

ఒక—ఆ—ఆ—ఎన్ని శ్లోకాలు చదివితే అన్ని సాష్టాంగ నమస్కారలు చేయ్యాల్సిందే!

వర్త.—అంతభక్తా!!

ఒక—అదొక వేషం. (వర్షంపడుతున్న శబ్దం) అరరే!... వర్షం పడుతున్నట్టుందే!

వర్త—ఆ! బాగా ముందుకు వస్తోంది.

రెండవ—ఆ పంచలోకి పోదాం పదండి! 3-4. కంఠస్వరాలు. పదండి! పదండి.

[వర్షంధ్వని పరమానందయ్య గీతాపారాయణ దగ్గరగా వినవస్తుంది.]

ఒక—ఏం భాగవతోత్తమా! మీకు కూడా ఈ వర్షంలాంటి ఈతిబాధలంటే భయమేనా? సర్వసంగ పరిత్యాగులు గదా! ఈ వెధవ శరీరం వర్షంలో తడుస్తే ఏం?

(అందరూ నవ్వుతారు)

జోగా—అవును వర్షంలో తడిస్తేఏం? పర్వాలేదు. జ్ఞానోదయం కలిగించారు. వస్తాను.

[గీతాపారాయణ చేస్తూ వెళ్ళారు]

వర్త—అరరే! నిజంగానే వెళ్తారా ఏమిటి? ఆయన వేళాకోళాని కంటున్నారు.

జోగా—నిజంగానే వెళతాను.

ఒక—వెళ్ళండి వెళ్ళండి. కాని సాష్టాంగ దండప్రణామాలు ఉన్నాయే-! అవ్వి మానెయ్యండి. దారంతా వర్షంతో బురద బురదగా వుంది.

జోగా—వస్తా (అందరూ నవ్వుతారు)

వర్త—మంచి వైరాగ్య వంతుడు.

ఒక—నే నొప్పుకోను. కాకపోతే వర్తి అమాయకుడని నప్పు కుంటాను.

వర్త—అటువంటి అమాయకుణ్ణి మనం ఆటలు పట్టించటం ఏం బాగుంటుంది.

ఒక—ఆ—ఏదో సరదాగా అన్నాను

[గీతాపారాయణ దూరంగా వినబడ్తూనే వుంటుంది]

వర్త—మీమాట నిజమనుకునీ—ఆయన బురదలో గూడా సాష్టాంగ పడ్తున్నాడే ?

రెండవ—వట్టి చాదస్తుడు. (నవ్వుతాడు.)

వర్త—నవ్వకండి ఆ భక్తి విశ్వాసాలుచూస్తే నాకు వళ్ళు పులక రిస్తోంది.

ఒక—(నవ్వుతూ) అయితే వారితోపాటు మీరూ తాం బూరా పుచ్చుకోండి.

వర్త—అంత త్యాగం చేయ గల్గితే యింకేం!

రెండవ—పోనీ ఘనంగా వక వరహా దానంచేయండి.

వర్త—అంతటితో మనకు తృప్తికల్గుతుందా. మహాభక్తుడు! వట్టి నూలుగుడ్డలతో వున్నాడు ఈ పట్టుకండువా, పట్టు ధోవతీయిస్తాను. కట్టుకుని భజన చేసుకుంటాడు.

ఒక—పట్టువా ?

వర్త—అవును. ఇవిగో.

ఒక—ఇవ్వా ! ఇంత ఖరీదైనవి ?

వర్త—ఫర్వాలేదు. ఆమహాభక్తుడి కిచ్చినదే పుణ్యాం.

(పాట బిగ్గరగా విన్పిస్తుంది.)

వర్త—మహానుభావా! మీభక్తి పారవశ్యానికి చాలసంతోషంగావుంది. మీబోటివార్ని చూచి సంతోషించటం కన్నా ఏమిచేయలేని అజ్ఞానుణ్ణి; ఈ రెండు పట్టువస్త్రాలూ మీరు స్వీకరించాలి.

జోగా—నాకా! నాకెందుకు యివ్వి! పూటకు పిడికెడు మెతుకులు, జావ; జానెడు వస్త్రంచాలు. భగవంతుని అపార కృపా విశేషంవల్ల ఈ రెండూ సమయానికి సమకూరుతూనే వున్నాయి. చూడబోతే ఈవస్త్రాలు రాజాధిరాజులు ధరించటానికి యోగ్యంగా వున్నాయి. 'భిక్షాన్నం దేహరక్షార్థం. కంథా శీత నివారణం!' అంటే! ఇవ్వి నాకెందుకు ? వద్దులెండి.

వర్త—అలా వద్దనకండి; భక్తిపూర్వకంగా యిస్తూన్నవాటిని వద్దనకండి. వద్దని నా మనసు కష్టపెట్టకండి; తీసుకోండి కట్టుకోండి.

జోగా— సరే! భక్తుల నొప్పించటం మంచిదికాదు. ఇవ్వండి. ధరిస్తాను.

వర్త— సెలవు. వస్తాను.

జోగా— మంచిది. (తిరిగి శ్లోకపఠనం చేస్తాడు. కాసేపటికి శ్లోకం దూరంగా వినిపిస్తూంటుంది)

ఒక— ఆ జోగికి యీ పట్టుబట్ట లెందుకిచ్చారండీ! కట్టుకోటమన్నా చేతకాదు. చూడండి. నడుంకి ఎట్లా చుట్టుకుంటున్నాడో.

(నవ్వుతారు)

రెండవ— ఆ! ఏమిటి! అట్టు చూడండి; ఆయన్ని చూడండి... ఆ సమాన్యారం వస్త్రాలక్షణం చూడండి.

ఒక— సుభ్రంగా సాష్టాంగపడి ముక్కుకొనదాకా మట్టిలో దూర్చేసినాడు— యిప్పుడు. నడుంవంచడేం?

వర్త— బురదవుంది కాదూ?

ఒక— ఇందాకట్నుంచీ మాత్రం బురద లేదూ? బురదకొత్తగా వచ్చిందా?

రెండ— మరే ఇందాకట్నుంచీ వంటేసిండా బురదపూసుకోలే!

ఒక— రండిరండి దగ్గరకెళ్ళి తమాషా చూద్దాం.

రెండ— బాగా చూడండి. నడుంకూడా బాగా వంచడంలేదు.

ఒక—పట్టుబట్టలు నలిగిపోతాయని కాబోలు వెంట వెళ్ళాం—మహాతమాషాగావుంది.

రెండ—మొత్తానికి—యీ పరదేశపు వర్తకుడెవరోగానీ – పరమానందయ్యకి ప్రపంచపువాసన పట్టించాడు.

ఒక—ఓ వర్తకుడుగారూ ! మీా పట్టుబట్టల ప్రభావం చూద్దురుగాని రండి రండి వెంటవెళ్దాం.

(శ్లోకాలు దగ్గరగా వినిపిస్తాయి)

మూడ—జోగాపరమానందంగారూ ఈ పట్టుబట్టలు మీారు పూర్తిగా ధరిస్తేగాని మీామోహంలో భాగవత లక్షణం బాగా కనబడదు.

[నాగలి ఎద్దులు తోలుకుని వెళ్తున్న రైతు ఛో–ఛో–అని అరుపులు వినపడ్తాయి. ఎద్దులమెడలో గంటలశబ్దం కూడా వినపడ్తుంది.]

రైతు—అడ్డం లెగండి–బాబూ ! అడ్డంలెగండి.

ఒక—ఆగవోయ్–కాసేపాగు.

రైతు—అదేంటి బాబూ ఏదన్నా పెడ్డారం వుందా అక్కడ ఇంతమంది మూగారేమటీ ?

రెం—ఆ ! పెడ్డారమే మరి మన జోగాపరమానందయ్యగారు పట్టుబట్టలు కట్టారు.

రైతు—కట్టుకోనియ్యండి. మీాసోమ్మేమిబోయే ! సరదా పడ్డాడూ–కట్టుకున్నాడు. దోవకు అడ్డంలెగండి. . . లెగండి.

ఒక—ఇదికాస్తాయ్. క్రిందపడి నమస్కరిస్తే బట్టలకు బురద అంటుతుందని—అదిగో—చూస్తు-నడుంవంచి దణ్ణా పెడుతున్నాడు.

రెండ—వైరాగ్యం పట్టు బట్టలతో కొట్టుకుపోయింది.

ఒక—నిశ్చలభక్తి చంచలమైనది.

రైతు—పోనీయండి. ఉత్సుక్కో లేక ఆమూాదిరిగా తంటాలు పడుతున్నాడు. మనపని దండగెందుకు? నన్ను పోనీయండి. తొందరగా వెళ్ళాలి. ఎడ్లకు ఎండెక్కుతోంది.

ఒక—ఆ వెళ్ళు. మేం వద్దన్నామా? తప్పుకోండయ్యా కాస్త తప్పుకోండి దోవకడ్డం తప్పుకోండి.

[రైతు గొడ్లనుతోలుకు వెళ్తున్నాడు. శ్లోకాలు చదవటం ఆగింది.]

ఒక—ఇదేమిటి పట్టు గుడ్డలు తీసిపారేస్తున్నాడేమిటి?

మూడ—(రైతును ఆపి) మాట్లాడుతున్నాడు. ఆగండి. ఏమిటో విందాం.

జోగ—రెండు పట్టువస్త్రాలు. ఈ రెండు పట్టువస్త్రాలు లభ్యంకావటంతో నామనస్సు ఈ శరీరానికి బానిసగా మారిపోయింది. "నిత్యం సకలభోగాలతో సంతసిల్లే మనసు" భగవంతుడికి ఎంతదూరమైపోతోందో! ఓ పర

మేశ్వరా! యీ చిన్ని విషయంతో నా విషయలోలత నంతా విమర్శించావు. జ్ఞానోదయం చేశావ్ తండ్రీ! ఇక యిటువంటి పొరపాటు చేయకుండా ఉంటాను! ప్రాయశ్చిత్తం చేసుకుంటాను ప్రభూ! ఆ-ఆ-ఇదిగో ఈ రైతుకివ్వే యిచ్చేస్తాను. ఇచ్చేసి- నువ్వెవరో రైతువిలాగున్నావ్. అబ్బాయ్? ఈ పట్టు గుడ్డలు- యింద-తీసుకో.

రైతు—నాకెందుకండీ!

జోగా—(నవ్వి) నీ మాత్రం జ్ఞానం యీ అజ్ఞానుడికి లేకపోయింది. రాగద్వేషాలు తెంచుకోవటం చేతగాని మూర్ఖుణ్ణి; ఇవ్వి తీసుకో "తీసికొని నాకో సహాయం చెయ్యి, నాయనా! ఒక్క-రెండు నిమిషాలు- ఒక్క-రెండు నిమిషాలపాటు, నీనాగలి ఎద్దులు నాకియ్యి.

రైతు—ఎందుకూ?

జోగా—మరేమి లేదు. మళ్ళా పదనిమిషాల్లో నీ నాగలీ ఎద్దులూ తీసుకు పోదువుగాని; స్నానాలరేవుదాకా వీటితో నేనూ వెళ్తాను' ఈ శరీరదోషానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను.

రైతు—సరే. తీసుకోండి.

జోగా—ఆ. నీ వుపకారానికి జన్మాంతం కృతజ్ఞతగా వుంటాను. దగ్గరగారా; ఈ నాగలి కాడికి నన్ను కట్టు ఇదిగో-ఈవుత్తరీయంతో- నన్ను గట్టిగా కట్టు. ఆ.

రైతు—ఎందుకు ?

జోగా— ఏంలే. కట్టు. ఆచర్నాకోల యిట్లాయియ్యి ఆ-ఆ బాగాకట్టు (.........కాసేపు ఆగి.........) ఆ! బాగుంది. నీమేలు మర్చిపోను ఈ జన్మలో నీమేలుమర్చి పోను. ఆ! నువ్వు తప్పుకో; తప్పుకోనాయనా, నీకుదెబ్బ తగులుతుంది తప్పుకో.

[చర్నాకోలు విదిలించిన శబ్దం. గొడ్లుపరుగెత్తి గంటలు మ్రోగిన శబ్దం]

అందరు — ఆ-ఆ దేమిటి ! చచ్చిపోతాడు !

రైతు—ఆ ! గొడ్లను చావబాదేస్తున్నాడు ! కొట్టకయ్యోయ్ గొడ్లను కొట్టకు.

ఒకరు—వళ్ళంతా గీసుకుపోతోంది.

రైతు—పరుగెత్తండి—ఆపుదాం.

అందరూ—పరుగెత్తి పదండి అందరూ—ఆపుదాం.

రైతు—నా గొడ్లను కొట్టకయ్యోయ్! గొడ్లను కొట్టకు.

అందరూ—ఆపండి ఆ గొడ్లను ఆపండి.

రెండవ—రక్తం; వరదలై కారుతోంది.

మూడవ—మార్గమంతా రక్తమయమే.

[గొర్లమువ్వల శబ్దం ఎక్కువై - దూరంగా
కేకలూ విన్పిస్తాయి]

పట్టుకోండి ఆగొర్లనాపండి అడ్డం పదండి.

4వ — కొత్తకంఠస్వరం ఆపరా! ఆగొర్లని ఆపు. నువ్వేటు అడ్డంనుంచో, నేనిటు అడ్డంపడతా.

5వ — ఇంకో—ఆ—ఆ. ఛో—ఛో—ఛో—ఛో,

[గొర్ల మువ్వల శబ్దం నిమ్మదిగా ఆగింది.]

[వెనకనిలచి కేకలు దగ్గరగా వినవస్తాయ్]

అందరు — విప్పండి. ముందు కట్లు విప్పండి.

ఒక — అబ్బి! వళ్ళంతా. సీసుకపోయింది.

రెండవ — స్మృతికూడా తప్పి పోయింది.

మూడో — చావలేదు. నాడి బాగా నేడుంది.

4వ — పరమానందయ్యగారూ! పరమానందయ్యగారూ!

5 వ — ఉహు. లాభంలేదు. ఇంటికి చేరుద్దాం — పట్టండి.

రైతు — ఆగండి; ఏదో మాట్లాడు తున్నాడు.

జోగా — మహానుభావా...దీనిలో...విపరీత మేముంది?

ఒక — ఏదో మాట్లాడుతున్నాడు.

రెండో — సంధేమో!!

జోగా—దీన్ని విపరీతమే నంటావా ?–దీన్ని–కాచేసిన తప్పుకు ఈమాత్రం శిక్ష అక్కర్లేదూ ?

ఒక—కాదు–అర్థయుక్తంగానే మాట్లాడుతున్నాడు.

జోగా—ఆ ! అక్కర్లేదూ ? కాదు. సర్వలోక ప్రభూ. నీ మీది ధ్యానం విడిచి, యీ శరీరంమీదకు ధ్యానం మర లించి. ఈశిక్ష శరీరానికీ, మనసుకూ, కూడా అవసరమే.

ఒక—భగవంతుడితో మాట్లాడు తున్నాడా ?

రెండో—హుష్.

జోగా—అవును. "జంగమ శ్రీవిమనాని హృదయాని మనీ షిభః!" అవును. అందరిమనసులోనూ నువ్వు వున్నావు. నామనసులోనూ నువ్వున్నావు అవును. ప్రతిమనిషి హృదయం నీ ఆలయం నేను భుజించినదే నీ కాహారం; నామాటలే నీ స్తోత్రములు; నా 'గమనమే' నీ ప్రద క్షిణ; అవును. కాని– యీ మనసు నిన్ను విడిచి ఆ హార్యాలమీదకు వెళ్లిందే ! మరి శిక్షార్హం కాదా ! (కాసేపు నిశ్శబ్దం) ఈ శిక్షలో బాధ, నామనసులోవున్న నీకూ కల్గిందా ! అయ్యయో ! ఆ ఆలోచనే నాకు కలగ లేదే . ప్రభూ ? ఆ మాత్రం బుద్ధివుంటే ఈ పాపానికే నే నొడికట్టుకునేవాణ్ణి కాదు ప్రభూ; నన్ను క్షమించు తండ్రీ ! నామనసులోనే వుండి నామనస్సు నింతచంచలం చేశావేం ప్రభూ ? నిశ్చలమైనభక్తి యీ మనస్సులో